C



# భారతి

వ్యవస్థాపకులు
దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు

మార్చి 1976

వెల: రూపాయిన్నర

# భారతి

మాసపత్రిక

*

శివలెంకశంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

*

మార్చి 1976

సంపుటము : 53

సంచిక : 3

విడిప్రతిక వెల రు పాయిన్నర

# నవ శకోదయంలోకి అడుగుపెట్టిన ఆంధ్రప్రదేశ్

"ప్రయత్నించి వెతికి, మార్గాన్ని కనుక్కోవాలిగాని లొంగిపోకూడద"ని పురాతన గ్రీకు ... ధైర్య సాహసాలను గురించి ప్రస్తావిస్తూ కవి గానంచేశాడు. ఈనాటి సమస్యలను ఎదుర్కొని, భారత భవితవ్యాన్ని తీర్చిదిద్దడానికి ఈనాడు మనకు అటువంటి సమధికోత్సాహ చైతన్యశక్తి మరింతగా కావాలి. ఆంధ్ర ప్రదేశ్ విషయంలో అక్షరాలా ఇంతే జరుగుతోంది. దేశ జాతీయ జీవన ప్రవంతిలో గణనీయమైన పాత్రవహించడానికి మన ఆర్థిక విధానాన్ని మరింత పటిష్టవంతంగాను, ప్రయోజనకరంగానూ తీర్చిదిద్దేందుకై శ్రీ జలగం వెంగళ రావు నాయకత్వంలో రాష్ట్రంలోని ప్రజా ప్రభుత్వం గత రెండేళ్ళుగా అన్ని విధాలుగా కృషిచేస్తోంది.

రాష్ట్రసమైక్యతను దృఢపరిచేందుకు ఉద్దేశించిన ఆరుఅంశాల పథకం విజయవంతంగా అమలు పరచ బడింది. వెనుకబడిన ప్రాంతాలను అభివృద్ధిపరచడానికి ఏడాదికి పైగా తీవ్రతరకార్యక్రమం ఒకటి అమలు జరుగుతోంది. అయిదో పంచవర్ష ప్రణాళికాకాలంలో చాలా ఉదారంగా మనకు లభింపజేసిన 90 కోట్ల రూపాయల సహాయంలో ఈ కార్యక్రమాన్ని అమలుపరచడం జరుగుతోంది.

ఆరుఅంశాల కార్యక్రమాన్ని విజయవంతంగా అమలు జరపడంవల్ల జాతీయ నిర్మాణ కార్యక్రమాలపై మన దృష్టిని, మన శక్తియుక్తులను కేంద్రీకరించడానికి వీలు కలిగింది. గత రెండేళ్ళలోనే మనం మనప్రణాళికా పెట్టుబడులను రెండింతలుకన్నా ఎక్కువచేసుకోగలిగాం. ఇప్పుడు ఇది రూ. 190 కోట్లు వుంది.

ప్రధానమంత్రి ప్రతిపాదించిన 20 అంశాల నూతన ఆర్థికకార్యక్రమం కొత్త బాధ్యతలను మన మీద పెట్టింది. ఆంధ్రప్రదేశ్ సమధికోత్సాహ చైతన్యశక్తితో ఈ బాధ్యతలను నిర్వర్తించడానికి ముందుకొచ్చింది. నిత్యావసర వస్తువుల ధరలను అదుపులోకి తేవడం జరిగింది. ఇప్పుడు భూసంస్కరణలచట్టం చురుకుగా అమలు జరుగుతోంది. భూ మాతను నమ్ముకున్న పేదరైతాంగపు చిరకాలవాంఛితం ఇక నెరవేరగలదు. బలహీనవర్గాలకు చెందిన దాదాపు 3 లక్షల కుటుంబాలకు ఇళ్ల స్థలాల్ని కల్పించే బృహత్తరకార్యక్రమానికి ఈ ఏడాది 10 కోట్ల రూపాయలు ఖర్చుకాగలదు. ఇళ్ల స్థలాలు పట్టాల పంపిణీ కూడా త్వరత్వరగా సాగుతోంది. గ్రామీణ ప్రాంతాలలో భూస్వాముల స్థలాలలో చిరకాలంగా యిళ్లునిర్మించుకుని నివసిస్తున్న సన్నకారురైతుల, వ్యవసాయ కూలీలు, చేతి వృత్తులవారికి ఆయిళ్లస్థలాలపై యాజమాన్యపుహక్కుకల్పించడం, గ్రామాల్లోని బలహీనవర్గాలు, చేతివృత్తుల పనివారు, వ్యవసాయ కార్మికులు మొదలైన సన్నకారు ప్రజానీకం తీసుకున్న అప్పుల చెల్లింపుపై మారిటోరియం విధించడం, వెట్టిచాకిరీ నిషేధించడం, వ్యవసాయ కార్మికుల కనీస వేతనాలను హెచ్చించడంవంటి చర్యలవల్ల సమాజంలో చిరకాలంగా అణచివేయబడుతూవచ్చిన, దోచుకోబడుతున్న వర్గాల అభ్యుదయానికి, వారిసంక్షేమానికి నిర్మాణాత్మక కృషికి శ్రీకారం జరిగింది.

ఈనాడు మన రాష్ట్రం పారిశ్రామికీకరణలో ఒక నూతన శకాన్ని ఆరంభించింది. పారిశ్రామికవేత్తల్ని రాష్ట్రానికి ఆకర్షించేందుకై అనేక ప్రోత్సాహకరచర్యలను మనం ప్రకటించాం. దాదాపు 250కోట్ల రూపాయలు పెట్టుబడిలో, భారీ మధ్యతరహా పరిశ్రమల్ని ప్రారంభించడానికి 1974-75లో 90 లైసెన్సులను యివ్వడం జరిగింది. వీటివల్ల 30,000 మందికి ఉపాధి లభిస్తుంది.

1974 మేలో జిల్లాల్లో ప్రారంభించిన తీవ్రతర ఉద్యమం ఇప్పుడు మొత్తం రాష్ట్రం అంతటికీ విస్తరించి లఘుపరిశ్రమల రంగంలో అనేక కొత్త యూనిట్లు ఏర్పడడానికి దోహదం చేస్తోంది.

రాష్ట్ర ఆర్థిక వ్యవస్థ అభివృద్ధికి నీటి పారుదల, విద్యుచ్ఛక్తిరంగాలు చాలా కీలకమైనవి. వార్షిక ప్రణాళికలో ఈ రెండు రంగాలలో నిర్మాణంలో వున్న ప్రాజెక్టులపై పెట్టుబడులను మనం ఎక్కువ చేశాం. నాగార్జునసాగర్, శ్రీశైలం, తుంగభద్ర, వంశధార, గోదావరి బరాజ్‌లకు వార్షిక ప్రణాళికల్లో ఎక్కువకేటాయింపులు చేశాం. గోదావరి జలాల వినియోగానికి సంబంధించి ఇటీవల కుదుర్చుకున్న ఒప్పందం నిజంగా చరిత్రాత్మకమైనది. ఈనాడు ఆంధ్రప్రదేశ్ ఒక నూతనశకారంభంలో వుంది.

నెం 35/75 76. సమాచార, పౌరసంబంధ శాఖాధిపతి డైరెక్టర్, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం. హైదరాబాద్.

Statement about ownership and other particulars about newspaper

**BHARATI**

FORM IV (See Rule 8)

1. Place o publication
Vijayawada

2. Periodicity of its publication.
Monthly

3. Printer's Name.
Sri S. Radhakrishna
Whether citizen of India: Yes
Address: 16, Luz Avenue,
Mylapore Madras-4

Publisher's Name.
Sri S. Radhakrishna
Whether citizen of India: Yes
Address: 16, Luz Avenue,
Mylapore Madras-4.

. Editor's Name:
Sri S. Radhakrishna
Whether citizen of India: Yes
Address: 16, Luz Avenue,
Mylapore, Madras-4.

Names and addresses of individuals who own the newspaper and partners or share-holders holding more than one percent of the total capital:

| Names | Addresses |
|---|---|
| Mr. S. Radhakrishna, | 16, Luz Avenue Mylapore Madras-4 |
| 2 Mrs. S. Kamakshamma | Do |
| 3 Mr. S. Nageswara Rao | Do |
| 4 Mrs. S. Rajeswari | Do |
| 5 Mrs. S. Seshamma | Do |

I, S. Radhakrishna, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

S. RADHAKRISANA
1-3-'76. Signature of Publisher.


# విషయానుక్రమణిక

## మార్చి 1976

# ఏదీ నా ప్రేరణ?

శ్రీ జి. వి. సుబ్బారావు

ఏదీ నా ప్రేరణ ?
ఏదీ నా కవితా మనో నిరీక్షణ?!—
తొలివెలుగు రేకల లేతచివళ్ళలో
చిలిపిగా తొంగిచూసే
చీకటి క్రీగంటి చూపులా ?
మలిసంజ మసక చీకట్ల నీలి చివళ్ళలో
వలపు జాబిల్లి చిందించిన
వెన్నెల వెలది చిరునవ్వులా?
ఎదలువ్వెత్తుగా పొంగిపొరలే వేళలో
మది లోతుల నెగసి పడే
నిప్పుకొండ ఉమిసే 'లావా'లా?
గుండె లవిసే దుఃఖ బడబాగ్నిశిఖలలో
పండువెన్నెల చుంబించే
ఆనంద జలధీ తరంగాలా?
ఊహా గగనయాత్రా విహారానందంలో
వాస్తవ జీవనపథ కంటక
నిత్య బాధా గాథాస్మృతులా?
అట్టడుగు అగాధాలలోనికి మనసు
నెట్టబడ్డ సమయంలో
చిట్టచివరి మలుపున
తళుక్కుమన్న ఆశాభావజ్యోత్స్నలా ?
వైవిధ్యం, వినూత్నత్వం, రసాత్మత
వెల్లివిరిసే కళా క్షేత్రంలో
నైరాశ్యం, సంకుచితత్వం, విరిహ పండించిన
పాంస్కృతిక గౌతమీ జలవిజృంభణలా ?
తిరుగులేని సుడిగుండపు వలయాల
బరువైన తుదిఘడియల్లో
మరలి వచ్చిన కొసఊపిరి గుండెల్లో నింపిన
కవితా పినాకినీ పీయూషాలా?
వాసంత వికసిత రసాల కిసలయాలు
మెసవిన మృదు మధుర కోకిలారవంలో
ఆషాఢ మేఘ హృదంతర తీవ్ర
వర్షాగమ సూచక దౌర్జన్య గర్జనలా ?
శిశిర హేమంత శీతలానిల ధాటికి
స్తంభించిన జడప్రకృతిలో
గ్రీష్మర్తువేళ కవోష్ణ పులకిత
మల్లికాసుమ చైతన్య వికాస సౌరభాలా ?
స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాతృత్వం
పెల్లుబికిన జాతీయ భావనలో
సంకెళ్ళు, స్వార్థం, విధ్వంసక భావం
అట్టుడికే సంఘ విద్రోహక చర్యలా ?
అస్వతంత్రంగా, అజ్ఞాతంగా, అమానుషంగా
విహరించిన భావనా హర్యక్ష హృదయంలో
స్వేచ్ఛా మానవ సౌహార్ద్ర భావ ప్రకట
నోద్ధృతంగా తలయెత్తిన సింహగర్జనలా ?
ఏదీ నా ప్రేరణ ?
ఏదీ నా కవితా మనోనిరీక్షణ?!—

# బాపురెడ్డి గేయములు:

## శ్రీ గెల్లి రామమోహనరావు

తెలుగు కవితలో గేయరచన ఒక ప్రక్రియ. ఆధునిక కవితలో గేయము ప్రముఖస్థానము వహించి ప్రాశస్త్యమును పొందు చున్నది. పూర్వసాహిత్యమునందు తుమ్మెదపదములు, కర్షక గీతములు, పడవ పదములు, పల్లీజన ప్రేమగీతములు, దంపుళ్ల పాటలు, ఏల పాటలు మున్నగునవి యన్నియు గేయవాఙ్మయశాఖకు చెందినట్టివి. నవ్యసాహిత్యము జనింపకపూర్వమే అర్వాచీనులదృష్టి గేయరచనపై ప్రసరించినది. కవులు సామాన్యముగ ఛందస్సంప్రదాయానుసారముగ గేయములు రచించియుండిరి.

ఆధునికులలో గేయరచనకు గురజాడ అప్పారావు మార్గదర్శకులు. వారు నాటిన బీజములు నేటికి వివిధ ఫలపుష్ప సంభరితమై విరాజిల్లుచున్నవి. తదుపరి విశ్వనాథ, బాపిరాజు, శివశంకరశాస్త్రి, బసవరాజు మున్నగువారు గేయములు రచించి ప్రశస్తిని పొందినారు. ప్రకృతి పురుష స్వరూపులైన జగదేకమాత, లోకేశ్వరు లిద్దరే ఆధునికుల భక్తికి అధిష్ఠాన దేవతలు. నిర్గుణత్వాన్ని నిరసించరుగాని సగుణమంటే సంతోషం అధికం. బహుమూర్తులను ఆరాధించినా బ్రహ్మపదార్థం ఒకటేనని వీరి విశ్వాసం. ముముక్షుమార్గానికి భక్తులు అవలంబించే పంచభావాలలో దాస్య, వాత్సల్య, మధురాలమీద మక్కువ. వెతికే శాంతం కూడ అక్కడక్కడ కనిపించకపోదు. ద్వైతాద్వైతాది జిజ్ఞాసలలోకి దిగరు. ఇవి నేటి ఆధ్యాత్మిక భక్తిగీతముల లోని విషయము.

చింతా దీక్షితులు బాలవాఙ్మయబ్రహ్మ. చిన్నారి హృదయములు రంజింపచేయుటకు గేయములలో కథలు రచించి బాలలకు విజ్ఞాన వినోదములు కల్గించి అలరింపచేసినారు. గేయములకు లయ ముఖ్యము. సాధ్యమైనంతవరకు భావములు గజిబిజిలేకుండ వివరించిన యెడల ఆ యా గేయములు బాలలకు సులభగ్రాహ్య మగునను ఉద్దేశముచే గేయములు రచించినారు.

నేడు గేయములు విరివిగా ప్రచారమునకు వచ్చుచున్నవి. ఆధునిక గేయకర్తల సామూహికశక్తిసామర్థ్యములవలన ఇతర రచనా ప్రక్రియలతోపాటు సమానగౌరవము లభించుచున్నది. ఈ గేయములలో ఆత్మానుభూతి అధికము. ఆవేశము శ్రుతిమించును. ఈ ఆధునికులలో కొందరు వాస్తవమునకు దూరముగనుండి ఊహాలోకములో మునిగి కవితలను సృష్టించుచున్నారు. మరికొందరు వాస్తవికతకు సన్నిహితులై నిరంతరము జీవితమునందు జరుగు సంఘర్షణను భావన చేసి అందముగ వివరించుటకు ప్రయత్నము చేయుచున్నారు. సమాజమున పేరుకొనియున్నకుళ్ళును బయటపెట్టి శోషణముచేయవలయునను తాపత్రయముతో గేయములందు వ్యంగ్యస్ఫూర్తిని కలిగించుచున్నారు. నూతనత్వమని ఆశలు పెంచుకొని అస్తవ్యస్తముగ గేయములు రచించిన నిరుపయోగమగును. లక్షణమునకు ఇమడని గేయములను ఇతర సాహిత్యములనుండి అనుకరించి తెలుగులో చూపించుచున్నారు. "కాని నూతనత్వమనేది భాషా నియమోల్లంఘనాలవల్ల సిద్ధించదు. కవి సమయాలు పాటిస్తే నూతనత్వానికి భంగం రాదు. అర్థపుష్టి, అన్వయసౌలభ్యమూ మొదలైన గుణాలు లేకపోతే నూతనత్వానికి కాదుగదా కవితకే భంగం కలుగుతుంది. భావాలు నూతనంగా ఉండవచ్చు. పదసంఘటనలు క్రొత్తతీరుగా కూర్చవచ్చు. నూతనత్వంకోసం అర్థము పాడయ్యేటట్లు కూర్చటంలోనూ నూతనత్వం లేదు."

నవ్య గేయ రచనలలో రెండు మార్గములు గలవు. అందులో మొదటిది భావకవుల కవితాపద్ధతి. రెండవది అభ్యుదయదృష్టి. మొదటి మార్గములో సమాజము మృగ్యము. మధురపదసమ్మేళనము, కల్పన, వర్ణన ప్రధానము. రెండవ మార్గములో సమాజము ముఖ్యము. మానవ జీవితమునందలి సంఘర్షణ చిత్రించుట ధ్యేయము. విశ్వశ్రేయస్సుపై కవి దృష్టి నిలిపి కవితలు అభ్యుదయ మార్గము వైపుకు నడిపించును. ఈ రెండు మార్గములను కవితలో చూపించి కృష్ణవేణీ మహాగానవిన్యాణమును విని ముదుటి ప్రణయ కుంకుమ కాంతులు చూచి, వినీల కుంతలకాంతి తరగలజాడల పరిశీలించి ప్రకృతి హస్తాలలో చంచలాడోలలో మైమరచి ఆనందముల తే మానవుని ఆవేదనలలో సొలి ప్రణయగీతికలు, ప్రగతిగీతికలు రచించుచున్నవారు శ్రీ బాపురెడ్డి. "చూచిన ప్రతి వస్తువునూ కల్పనా చతువులతో పరికించి చూడగల, భావనా రసనతో చవిచూడగల గుప్త సత్యాలకు లిప్తలో తెర తీయగల, తెరవెడలిన రసతత్త్వ భావా

లకు శబ్ద శాద్వలాలు" నిర్మింపగల మౌలిక ప్రతిభ ఉన్నవారు. అట్టి వారి గేయములు ప్రస్తావించుట ఈ వ్యాసోద్దేశము.

గేయములలో ప్రణయమూర్తి విరుల దండల మాటున, తొంగిచూచినది. ఆ మూర్తి అలిత సౌందర్యమున కాకరము. అతులిత భావ సంపదకు, ఆధ్యాత్మిక ధ్యానమననమునకు, అలౌకిక ప్రణయ రాగమునకు చిహ్నము. ప్రణయార్పణలో రాగ లతలు విరబూచినవి. అధరములు స్పందించినవి. సుధలు పొంగి పొరలినవి. ప్రియుడు తన్మయుడై పెదవులు కరచినాడు. మరచి ఇంద్రలోక సుధామాధురిలో నిలిచినాడు. చెక్కిలి నొక్కి హిమగిరు లధిరోహించెను. గాలి ఈలవేయ శివునిలీల నాట్యమాడెను. నడుమునుచుట్టి నింగి కొసలు ముట్టెను. ప్రణయ కళాసీమ లేలి పంచాస్త్రునే కొట్టెను. కౌగిలి చేరి కన్నులు మోడ్చెను. లోకమున కోటికోటి నాకములను చూచెను.

ప్రణయ రాగిణి చంచల. ఒక క్షణ మొక ప్రియుని గుండెలో, మరియొక క్షణమొక విరహతప్తుని హృదయములో, వేరొక క్షణమొక నిరుపేద అంతరంగములో అంతర్లీనమై చరించు చుండును. ఎవని దగ్గర ఎక్కువకాల ముండదు. ఎప్పుడు వచ్చునో, ఎప్పుడు పోవునో ఎవ్వరికి అంతుపట్టదు. అపారమగు ఈ ప్రపంచములో సర్వము తానై నడకలు సాగించును. నర్తనలు సల్పును. ప్రణయకడలిలో అనురాగ తరంగములు వెదజల్లునంతవరకు ఆరాధనలో ఆనందము కలుగును. కాని ఆ మూర్తి కరుణా కటాక్షములకు భక్తుడు దూరమైనపుడు నిర్వేదపు సెగలు వెళ్లగ్రక్కుచు

నిర్వృతిని ధ్యానమ్ము
నిరవస్థితి నుంటి
శ్రమించు సఖుడు నా
శూన్య జీవితములో

అని ఆవేదనలో అలమటించిపోవును. తాపములో కోపము ఉదయించును. కోపములో తాపము చిగురులు తొడుగును. భక్తుడు కోపతాపముల కలితుడగుటచే ఆ రూపమును చూడవలయునను ఉత్కంఠతో

నీ అందియల పాట
నీదు గాజుల మాట
విననెంచి మరి యేది
వినకుండ నీమీదే.

మనసు నీదియని ఆనపెట్టినను ఆ మూర్తి కరుణింపలేదు. ఎన్ని మాటలు చెప్పినను పలుకకుండ మిన్నకుండెను. స్నేహానిలములతో, చిరునవ్వు విరులతో విరహశిశిరమునుండి విడుదల చేయుమని అర్థించినను మరుమాట లేదు. రాగరంజితుని హృదయ మువ్విళ్ళూరినది. ప్రేమరసవృష్టి కురుపించునని మంజులాశయ బీజము లెన్నో విమల యౌవన క్షేత్రమున చల్లెను. అయినను ప్రయోజనము నాస్తి. నరకము ననుభవించున్న ఎడబాటును రూపుమాపమని దేవిని ప్రార్థించి కోరెను. ఆ ప్రార్థనకు ఫలము కలుగలేదు. కరుణరస దృష్టి ప్రసరింపలేదు. విడిపోని వలపు బిగికౌగిలి కూర్చలేదు. రసరాగ మధుర స్వర్గము ప్రసాదింపలేదు. అలసి సొలసి కడకు భక్తుడు మూర్తి చరణములపై వ్రాలి

దళిత జీవిత విప
త్కాల గానము ప్రియా
శరణాగతుడ నేను
కరుణించి రక్షించు.

అని పదేపదే దిక్కులు పిక్కటిల్లునట్లు మాటలు మారుమ్రోగెను. అభిలాష నుడులు తిరిగినవి. కన్నుల అశ్రుధారలు నిండినవి. గొంతు తడియారినది. వాక్కు రుద్ధమాయినది. పాదమంజీరములే గుండెను గాయపరచినవి. అయినను అతిలోకమూర్తి కన్నులు తెరచి అభయ హస్త మందింపలేదు. భక్తుని మనసులోని కోరిక సన్నగిల్లలేదు. మూర్తిస్వరూపమునే ధ్యానించుచు కాలచక్రపు టంచులపై తిరిగెను. బాధ తీరినది. ఆశలు పెనవేసికొన్నవి. ఊహలు, అనుభూతులు అందముగా అందలమెక్కినవి. భావచిత్రములు మదిలో మెదిలినవి. సర్వశాస్త్రసారము ఆమె దరహాస మకరంద ధారలో కనిపించినది. శస్త్రములు, సకల అణ్వస్త్రములు చూపుచలువలో మంచుగడ్డవలె కరగిపోయినవి. పాపములు కంటిదీపముల వెలుగులో తానమాడి పుణ్య ధామము లైనవి. గాడుపులు అమృత భావములో ధన్యములైనవి. పొంగిపోయి సేవకుడు కళలన్నియు రంగురంగులబావుటాలుగా నెత్తి, సాహిత్యములో కావ్యసౌరభము నింపి, సౌందర్యమునకు మహోజ్జ్వల దీపములు పట్టి ఆనందముతో తోరణములు కట్టిన ప్రమోదములో

నీ జీవితోత్సవ మిదే జరుపుచుండగా
నేను మైమరచి నాలోని కన్నులు తెరచి
దర్శింతు, హర్షమ్ము వర్షింతు స్థిరమైన
కలవోలె నీ యశఃకళవోలె జీవింతు

అని ముద్దు ముద్దు మాటలు మూటలుగట్టి పరవశించిపోయెను. అదే భక్తుని తుది విన్నపము. లోకన్నులు తెరచి తరచి తెలిసికొన్నప్పుడు కలుగు ఆనందమున కవధు లుండవు. అంతకంటె మించిన పరమార్థము సేవకునకు మరియొకటిలేదు అదే అతని ఆధ్యాత్మిక జీవనమునకు దీపశిఖ. అలౌకిక వాంఛల కంతకంటె సంతృప్తి మరియొకటి లేదు.

ఈ ఆరాధనలో మధురభక్తి అని మరియొకటి లేదు. ఆ మధురభక్తిలో భక్తుడు ప్రియురాలై ప్రియుని పొందును కోరును. అతని రాకకు నిరీక్షించును. సర్వాంగ సుందరముగ అలంకరించుకొని మదిలో రూపమును పునః పునః తలచుకొని పరవశించి పోవును. ఇట్టి భక్తినే తాళ్ళపాక అన్నమాచార్యులు ప్రదర్శించెను. బాపురెడ్డిగారిట్టి మధురభక్తినే కవితయందు చూపించినారు. ప్రియురాలు ప్రియునకు దూరమైనది. యౌవన ప్రాంగణమున నిలబడి వలపు గుబాళింపు లందింపవలయునని కుతూహల పడినది. కాని ప్రియుడు రాకపోయె. మనసు వాడిపోయిన మల్లెలా వడిలిపోయినది. ఆలాపన ఆరంభమైనది. ఆ ఆలాపనలో

కటికి నేల నడచి నడచి
కందిన నా పాదమ్ములు
ఎఱ్ఱ గులాబీలై పోయెనురా
ఎఱ్ఱ గులాబీలై పోయెనురా.

అని ఆక్రందించినది. యవ్వన భారముచేత నడుము తరిగి తరిగి కరిగి పోయినది. చీకట్లను చించి చీల్చి అన్వేషించునరికి కన్నులు కాటుకలైపోయినవి. చిదానందునిరూపము కనుంగొనిపి తపస్సు చేసెను. తపః ఫలము లభింపలేదు. దీర్ఘమైన తపస్సులో జడలు మడమలంట పెరిగి పోయినవి. నిట్టూర్పుల వేడిమిలో మసలి మసలి బుగ్గ లగ్గి బంతులైనవి. ప్రియుడు రానికారణమున తాపమున కోపములో కొరుకుకొన్న పెదవులు కుంకుమపూలై అరుణిమలో మిలమిల లాడినవి. వలపు వాకిట తలపుల తలుపులు తెరచి వేచియున్నను, గుండెలలో గుడులు కట్టినను ప్రియునిపొందు ప్రాప్తింపకపోయెను. ఊహలలో ఊగి తూగి ఉండలేక దొరలినట్టను వెల్లను వలపులు తరిగినవి. అయినను రసరాట్టు హృదయము ద్రవీభూతము కాలేదు. ప్రియురాలి హృదయము రాగతప్తమైనది. విరహాణి ఎద రగిలిపోయినది. మనసులో కలవరము బయలుదేరినది. కాని ఆశను వీడక

నవ్య జీవనగీతి
కామృతము కురిపించు
ప్రకృతీ! నీ విశ్వ వీ
ణా కల శ్రుతులతో
ననుకూడ శ్రుతిచేసి
కొని పాడుకొనవా

అని ప్రియురాలు అర్థించినది. పిలుపులో ఆక్రందనము అలముకొన్నది.

కవికి సామాజిక దృష్టి అధికము. అతడు కూడ సామాజికుడే. సమ్యక్పుంకు సమాజము కవితా వస్తువై వెలసినది. జగత్ప్రగతి వేగముగా మారుచున్న కొలది మానవజీవితపథము కూడ మార్పులు పొందుచునే యున్నది. వానర పరిణామమే మానవుడైన మనుజుడే యూపి ప్రపంచమునకు సుధలు కురియింప చేయుచున్నాడు. మానవుని జిజ్ఞాస కాంతిమహోనతి దొరికల తేయుచు విజ్ఞానపు టంచుల నధిగమించుచు అంతరిక్ష దిశాంతముల మెరుపై చరించుచు ఆక్రమించుచుండెను. ఈ శతాబ్దమున మానవుడే మహానుభావుడు. అతడు నిరంతర శ్రమజీవి. అతని జీవితమే ఒక యంత్రము. శ్రమము, త్యాగము భావి భారత జాతిసౌధము నిలుచున్నవి. శాస్త్రవిజ్ఞానము పెరిగిన తరువాత ప్రాత పద్ధతులకు స్వస్తిచెప్పి నూతన పద్ధతు లెన్నియో ఈ మానవుడు ప్రవేశపెట్టినాడు.

బండిబాట లేనిచోట
పడెను రైలుమార్గాలు
కాలిబాట లేనిచోట
కానబడెను రోడ్డులూ

ఇవంతయు సామాజిక ప్రగతియే. చమురుదీపములు వెలుతురు సరిగా వెల్గని పల్లెలలో కరంటు దీపమాల లేర్పడినవి. ప్రాజెక్టులు కట్టి పంటలు పండించుచున్నాడు. దేశమును అభ్యుదయమువైపునకు నడిపించుచున్నాడు. పోచంపాడుకు జీవము పోసినవారే శ్రామికులు. వారే నీళ్లలో విద్యుత్తులు చేయుచున్న భగీరథులు. నాటి రాజులు కోటలు కట్టి పడు, బురుజులు బావులు త్రవ్వుచున్నారు... నేటివారు ప్రగతికి పునాదిరాళ్ళు. ఇటువంటి గొప్పవాడైన మానవునిలో మాత్రము అంతరములు ప్రబలి జీవితములను నీరు గార్చుచున్నవి. భిన్న భిన్న మతములు, తత్వములు, అభిరుచులు ఉన్నవి.

ఒకడేమో వికసపుష్ప
ముఖరేఖలు వర్ధిస్తే
వేరొక్కడు దానిగొంతు
పిసికి పరీక్షిస్తాడు.

మానవజన్మలో ఈ అంతరములు, అభిరుచులు సహజములైపోయినవి. ఒకడు హిమాలయము అధిరోహించిన మరియొకడు భూగర్భమునకు గోతులు త్రవ్వి దేశ ప్రగతిని మంటగలుపును. ఆశయములు ఉన్నతములు. ఆచరణలు హళ్ళి. కష్టించి చెమటోర్చి పనిచేయువానికి పథ గమ్యము స్వర్గతుల్యముగా కాన్పింపవచ్చును. అదియే సోమరులకు ఘోర నరకముగా గోచరించును. ఇందులో ఏది స్వర్గము, ఏది నరక మన్న సత్యమును తెలిసికొని తదనుగుణముగా ప్రవర్తించిన మానవుడు మహితాత్ముడు గావచ్చును.

మన జాతిజీవను చంపిందిరా కులం
మన చరితను మలినం చేసిందిరా కులం
మన సమాజ దురాచార కారణం కులం
తర తరాల దరిద్రాల కారణం కులం.

పుట్టినవారందరి కుల మేదో గిట్టినవారందరిది కూడ అదే. కుల మతములతో స్వార్థపరులు క్రుళ్ళిపోవుచున్నారు. జాతి జీవనము క్రుంగిపోవుచున్నది. 'శ్వాస ప్రతివ్యక్తి' ఒకవిధమైన అవిశ్వలత్వానికి, అవిశ్వాసానికి, అస్పష్టతకులోనై కలవరపడుతున్నాడు. వ్యక్తి సంబంధాలు వక్రమార్గములు పట్టినవి. సంబంధాలు ప్రవర్తన ప్రాతిపదికలు కోల్పోయి నేటి మానవుడు దరిలేక అల్లాడుచున్నాడు. ఈ స్థితి మోసం, స్వార్థం, పక్షపాతం, అన్యాయంరూపంలో కన్పిస్తున్నది. ఈ విషయాన్ని గుర్తించారు కాని కావలిసినన్ని నివారణసాధనాలు అందించడం లేదంటే ఆశ్చర్యపడనక్కరలేదు. ప్రజాస్వామిక వ్యవస్థ మానవతకు పునాదులు నిర్మించి జీవన సౌధమునకు రూపురేఖలు దిద్దుచు సామాజిక ప్రగతికి దోహదము చేయుచున్నది.

స్వాతంత్ర్యము రాకకు పూర్వము కవులు దేశభక్తిని చాటి చెప్పుచు ప్రచారగీతిక లందించినారు. అదేవిధముగ బాపురెడ్డిగారు దేశాభ్యుదయమును చాటి చెప్పుచు కొన్ని ప్రచారగీతికలు వ్రాసి యుండిరి. పొదుపు, పిలుపు, కూలివాడు కుబేరుడు, ఏకతాసేతువు, వద్దేవద్దు, పుట్ట వొల్లని పాపలు, రవి చంద్రులు మున్నగునవి ప్రచార గీతములు.

ప్రపంచములో విపరీతముగ జనాభా పెరిగిపోవుచున్నది. అందుకాయా ప్రభుత్వములు రకరకములగు శాస్త్రీయ పద్ధతులు అవలంబించి కుటుంబనియంత్రణమును అమలుచేయుచున్నారు. దీనివలన దేశముయొక్క ఆర్థిక ప్రగతి కుంటుపడక ముందుకు సాగును.

బోలెడు పిల్లలను కని
జోలె చేతికీయొద్దే
గంపెడు సంతానంతో
కొంప ముంచుకోవద్దే.

అధిక సంతానమువలన ఆర్థిక ప్రగతి రాదు. పరిమిత సంతానములో ఆర్థిక ప్రగతి ఉన్నది. అంతేగాక ఆరోగ్యాది విషయములందు స్వస్థత చేకూరును.

ఇద్దరు బిడ్డలుంటే ముద్దు. అనురాగరూప మొకరు. ఆనంద దీప మొకరు. వారే శాంతిరేఖలు. సమతాంబుధితరగలు. అంతకంటె మించిన ఆనందము మరియొకటి లేదు.

మానవుడు పొదుపుచేయవలయు నను తలంపు కలిగి ఉండవలెను. ఆ పొదుపు దేశప్రగతికి దోహదము చేయును. అప్పుడే సంఘజీవియొక్క కృషికి సత్ఫలితములు కాన్పించును. దారిద్ర్యమును రూపుమాపి స్వర్గమును సృష్టింపవచ్చును. చీకట్లను పిండి కాంతి లోకమును నిర్మింపవచ్చును. ఆ విధముగ చేసిననాడు భావి జీవితము భద్రముగా నుండును. కలిగిన ఆదాయములో మిగిలించి దానిని మదుపుచేసి పెంపుచేసిన ట్లయిన కూలివాడు కుబేరుడు కావచ్చును.

నిన్న పొదుపు చేసుకొంటె
నేడు లేదురా దుఃఖం
నేడు పొదుపు చేసుకుంటె
రేపు కలుగుతుంది సుఖం

వీరి కవితలో కొన్ని ఎలిజీలు గలవు. ఆత్మాశ్రయ కవితలో 'ఎలిజీ' అనునది యొకటి బయలుదేరినది. ఈ ఎలిజీని గూర్చి A. R. Entwistle అనునతడు **"Some times death is the inspiration and sole theme, at other times it is merely the common starting point from which poets have launched various themes, speculations on the nature of death and the here ofter, tributes to friends, the poets own mood even literary criticism."** ఈ నిర్వచనములో మరణమునుగూర్చి ప్రధానముగ చెప్పినను మిత్రులు, ఆప్తులు, పుత్రులు, దేశ నాయకులనుగూర్చి వారి మరణములను స్మృతికి తెచ్చుకొని గీతిక లల్లినచో అది ఎలిజీయే అగును. దీనినే నారాయణరెడ్డి గీతముగా పేర్కొనిరి.

బాపురెడ్డిగారి గేయములలో దేశనాయకులు, కవి, పుత్రిక మరణములకు సంబంధించిన కొన్ని స్మృతిగీతములు గలవు. ఆయా గీతములలో కవి హృదయము స్పందించినది. కన్నీటి చుక్కలు రాల్చినది.

రవి అస్తమించని బ్రిటీషు సామ్రాజ్యమును అహింసాయుధముతో జయించి భారత దేశమునకు స్వాతంత్ర్యమును సంపాదించెను. అట్టి మహాత్ముడు

జాతి భేదము లేదని
నీతి వర్తనలలో
మత విభేదము లేని
హిత బోధనములలో

జీవనయాత్ర సాగించి సత్యాహింసలను చేబూని సమరము సాగించి నడిపించిన అమర దీపము బాపు. ఆ బాపు అడుగుజాడలలో ప్రజను నడిపించి ప్రపంచ ప్రఖ్యాతి చెందిన శాంతివీరుడు జవహర్. భారత దేశమునకు మూలస్తంభము. ప్రజాస్వామిక వ్యవస్థకు పునాదివేసి దివ్యమందిరమును నిర్మించిన మహామనీషి. అట్టి మహానుభావుడు ఆకస్మికముగా సొమ్మసిల్లి కన్నుమూసెను. దానిని కవి తలపునకు తెచ్చుకొని

కనులకు కన్పడవు గాని
కలవు నీవు జగ మెల్లెడ
పలుకలేవుగాని ప్రగతి
పథము చూపుచుందు వెపుడు.

కాని అతని ఆశయములు దివ్యతేజ స్సంపన్నములు, అజరామరములు, అమూల్యములు. కవి మాత్రము స్వాతంత్ర్యము, సమైక్యత, శాంతి పరిరక్షించగలమని మాట ఇచ్చి జవహర్ స్వరూపమును పాఠకుల స్మృతిపథములో మెదలునట్లుగా చిత్రించినారు.

ఇంతకన్న నీ దివ్య
స్మృతి కేమిటి ఈయగలము
దీవించుము మమ్మెప్పుడూ
దివ్యలోక భూషణమా

లాల్ బహదూర్‌శాస్త్రి ప్రధానమంత్రిగ నెహ్రూతరువాత వచ్చిరి. ఆయన మాత్రము ఎక్కువ కాలము జీవింపలేదు. ఉన్నంత కాలము తన శక్తిసామర్థ్యములు ప్రదర్శించి పాకిస్థాన్‌పై విజయము సాధించినారు. మంచిని ప్రేమించినారు. మానవ హృదయములను లాలించినారు. తాష్కెంటులో శాంతిపావురము నెగురవేసిరి. ప్రతి వ్యక్తిహృదయములో దీపమువెలిగించి దారిచూపించిన మహానాయకులు.

అణ్వస్త్రములను మించు
ఆత్మబలమ్మును వహించి
కాలచక్రమును త్రిప్పిన
లాల్ బహదూర్‌శాస్త్రి

కన్ను మూసిరి, అట్టివారిని గూర్చి స్మృతిగీతికగా కవి రచించి యుండెను. 'సరిలేని కేసరి' గురజాడ, బడేన్‌పావెల్ మున్నగు గీతములు ఈ ఎలిజీ ప్రక్రియకు సంబంధించిననియే అగుచున్నవి. వీని యన్నింటిలో 'చుక్కల్లో ఉషశ్రీ' గీతము, స్మృతిగీతికలకు, ఆత్మాశ్రయ కవితకు మణిమకుటము. కవిగారి చిన్నారి ఉషశ్రీ కన్నుమూసినప్పుడు కలిగిన దుఃఖమే 'చుక్కల్లో ఉషశ్రీ' గీతము. రవిహృదయమున, కవిహృదయమున కారుమబ్బు క్రమ్మినది. మమతలు నిండిన హృదయము దూరతీరములకు చేరుకొనినది. ఉషారాగమును నిశా నాగములు ఓర్వలేక మ్రింగినవి. తండ్రి హృదయము తల్లడిల్లినది. మనసు ఆక్రందించినది. ఆ ఆక్రందనలో ఆవేదన ఉన్నది. ఆవేదనలో నిర్వేద మావరించినది. కడలితరంగములా విషాదములముకొన్నది. క్రుంగి, క్రుంగి దుఃఖించినారు. విధిని నిందించినారు. అయినా ప్రయోజనము లేదు. కాల చక్రమునందు జీవులు జన్మింతురు. ఆపైన మరణింతురు. కాని ఉషశ్రీ అంత త్వరలో కన్నుమూయునని కలలో కూడ భావింపలేదు. జరిగిన ఘటనను కవి స్మృతికి తెచ్చుకొని

ఎక్కడో వెలుగు
చుక్క పాపల మ
ఒక్క తార చేరినది అని కన్నీరు పెట్టుకొన్నారు.

కవికి—కావ్యమునకు అవినాభావసంబంధము గలదు. కవిసృష్టి కావ్యము. తన భావ ప్రపంచీకరణమునకు సాహిత్యము ప్రతిబింబముగా నుండును. ఈ విషయమును గూర్చి ఒక ఆంగ్లలాక్షణికుడీ విధముగా తెల్పియుండెను. **'Literature affords sad revelation not only of man's characteristics as a literary artist. but also of his pecularities as a thinker. We are aware of the subjects to-wards which his thought most naturally turns. We see his attitude ot mind, his manner of thinking his peculiar views andopinions'** కావ్యమునుబట్టి కవియొక్క భావములు గ్రహింపవచ్చును. భావములు కవియొక్క అనుభవమునుండి పుట్టినవై పాఠకుల అనుభవమునందలి ఆమోదకర మగు విషయములను స్ఫురింపచేయును. ఈ భావ ప్రపంచమే కవిలో లేనట్లయిన కవిత్వముయొక్క సౌందర్యము శోభింపదు. ఈనాడు వచ్చుచున్న కవితలలో పదికాలములపాటు నిలువదగిన కవితలు బాపురెడ్డిగారు సృష్టించినారు. ఆ యా కవితలందు నిరంతర ధార కాన్పించును. అర్థగాంభీర్యము, రసపుష్టి ప్రతిపదమునందు తొంగి చూచుచుండును. భావ ప్రపంచముయొక్క నిత్యానిత్యము తెలుంగగల సామర్థ్యము పుష్కలముగా నున్నది. సర్వము తేటతెల్లమై తోచు మన హృదయసముద్రమును తరచి అందలి లోతుపాతులను చూపి అందుండి అమూల్యమగు భావములను ప్రదర్శించినారు.

నీ కన్నుల వెలుతురులో
నే కన్ను తెరిచాను
కనులు తెరిచి నే నిది భూ
లోక మనే మరచాను, (నీవూ—నేను)

అతీతమూర్తిని లోకన్నులతో దర్శించినారు. ఆ కన్నుల వెలుతురు అజ్ఞాన తిమిరపటలిని పారద్రోలి విజ్ఞానము ప్రసాదించినది. జిజ్ఞాస బయలుదేరినది. కనులు వికసించినవి. లోకము కానవచ్చినది. కాని భూలోక మనే మైమరపు కలిగినది. ఆనందము అవధులుదాటినది. అతీతానందములో కవి కనిమిషత్వము ప్రాప్తించినది. 'కనులు తెరచి యుండుట' అనునది అనిమిషులను సూచన చేయుచున్నారు. ఇందులో ప్రేయసి లౌకికమూర్తి గాక అలౌకిక సామ్రాజ్యమునకు రసరాట్టుగా గ్రహింపవలయును. ఈ గీతమునందలి భావము లన్నియు కవియొక్క అంతర్దార్శనికమును తెలియజేయుచున్నవి.

నెదరులాండులో నేడు
నిదుర లేచినవి పూలు
నిదురలేవి నిదురలేపె
ఎద ఎద పరిమళాలు (పూలకదలి)

సాధారణవ్యక్తి పువ్వులు విచ్చుకొన్నవని చెప్పను. కాని కవి దానినే నిదుర లేచినవని చెప్పినారు. నిద్రపోయినప్పుడు కనులరెప్పలు మూసికొని ఉండును. నిద్రావస్థనుండి బయటపడినపుడు కనురెప్పలు తెరచుకొని ఉండును. అదేవిధముగ సుమము ముడుచుకొని యుండుటయే నిద్రపోవుట, వికసించుటయే నిద్రలేచుట. ఒకభావమును అందముగా ఊహించి చెప్పుట బంగారమునకు తావి అద్దినట్లుండును. వికసించిన సుమముల పరిమళములు మానవ హృదయముల గుభాళించినవి.

శిశిరంలా ఈసు రాలిపోయింది
వాసంతంలో ప్రేమ విరిసినది (ఆశారేఖ)

షట్ ఋతువులలో శిశిరము, వసంతము చేర్కొనదగినవి. ఈ ఋతువు పండిన ఆకులను భూమాత ఒడిలో నిద్రపుచ్చును. వసంతము రాలిన ఆకుల స్థానమున నూతన చిగురుటాకులు కూర్చును. ఈ చరణములలో ఉపమాలంకారము శోభితముగా నున్నది. శిశిరమునందు పండిన ఆకులు రాలినట్లుగా ఈసు రాలిపోయినది. వసంతమున నూతన చిగురుటాకు తొడిగినట్లుగ ప్రేమ విరిసినది. రాలిన స్థానమున విరియుట నూతనత్వమునకు చిహ్నము.

ఈ విధముగా గేయములందు అచ్చటచ్చట కవిభావములు సుందర మందారములై పరిమళించుచుండును. ఊహలెంత ఎత్తైనవియో అంత లోతయినవి. నడుముచుట్టి నింగికొసలుముట్టి ప్రణయకళాసీమచేరి పంచాస్త్రుని కొట్టుటలోనే కవి వ్యంగ్య భావ స్ఫూర్తి ద్యోతకమగుచున్నది. నారాయణరెడ్డిగారి మాటలతో ఈ వ్యాసము ముగించుచున్నాను.

'అలవోకగా వ్రాసినవి
ఆకాశవాణికి శ్రుతి చేసినవి
పత్రికలకోసం చెప్పినవి
మిత్రులకోసం గుప్పినవి
ఉద్యోగరీత్యా పల్కినవి
హృద్యోగరీత్యా చిలికినవి
ఎన్నెన్నో భావ మధు ధారలు కలసి
ఏకమైన బంతిపే. బాపురెడ్డి గేయములు

[1971లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు పొందిన గ్రంధమిది.]

# ది గైడ్

శ్రీ వి. సంపత్కుమారాచార్య

పద్యం :

నువ్వెవరు? నీకేం కావాలి??
నేను దీపాన్ని! సత్యస్వరూపాన్ని!!...
ఆకాశం నిండేలా వెలుగులు విరజిమ్ముతాను!...
చీకటిని కూకటి వేళ్ళతో పెల్లగిస్తాను!!...
నక్షత్రాలు నా ఏజెంట్లు!...
సూర్యుడు నా సెక్రటరీ!!...
నువ్వంత పొడుగెదగలేవని
రవ్వంత రూపంతో నీ ముందు నిలిచాను!!...
కళ్ళు మూసుకుని నన్నూహిస్తే
నీ గుండెల్లో కూడా మెదుల్తాను!!...
నోటికొచ్చినట్లు ప్రేలకు!... నోర్ముయ్!!...
ఉఫ్!!......

తాత్పర్యం :

బయటి దీపాన్ని
బలవంతంగా ఆర్పగలిగే మనిషి
లోపలి దీపం
లోపాలను చూపుతూంటే
ఏం చేయ గలడు??......

గమనిక :

పై పద్యమునకు ప్రతిపదార్థము, వ్యాకరణాంశములు అవసరము లేదని గమనించ ప్రార్థన.

# భారతదేశంలో మహిళల హోదా

శ్రీ ఐ. సత్యసుందరం

మన దేశంలో పురుష, స్త్రీల హోదాలలో అసమానతలు అనాదిగా వచ్చుచున్నవి. సాంప్రదాయక భారతీయ సంఘము స్త్రీ స్వాతంత్ర్యమునకు అర్హురాలు గాదని అభిప్రాయపడినది. భారతదేశ రాజ్యాంగింమా తము స్త్రీ పురుషుల హోదాలలో సమానత్వము ఏర్పరచినది. రాజ్యాంగములో 15వ నిబంధన ఈ క్రిందివిధంగా చెప్పుచున్నది.

ఉద్యోగ విషయంలో గాని, మరి ఇతర విషయాలలో గాని, పౌరుని మతము, జాతి, కులము, స్త్రీ పురుష భేదము, పుట్టిన పూరు ప్రభుత్వం లెక్కలోనికి తీసికొనదు. ప్రభుత్వ దృష్టిలో అందరూ సమానులే. వీటిని దృష్టిలో పుంచుకొని కొందరిని దుకాణాలలోనికి గాని, హోటళ్ళలోనికి గాని దేవాలయాలలోనికిగాని వెళ్ళుట నిరాకరించరాదు. బావులను, చెఱువులను ఉపయోగించుటలోగాని, ప్రభుత్వ వ్యయంతో ఏర్పరచిన పార్కులు మొదలగునవి వాడుటలోగాని అందరికి సమానహక్కు వున్నది. ఈ విధంగా రాజ్యాంగంలో వున్నప్పటికీ, స్త్రీలకు పిల్లలకు ప్రత్యేక సౌకర్యములు ఏర్పరచే హక్కు ప్రభుత్వానికి వున్నది.

రాజ్యాంగము 39వ నిబంధనలో వున్న ఆదేశిక సూత్రాలు కూడా పై విషయాలనే చెప్పుచున్నవి. వాటి ప్రకారం జీవనోపాధి కల్పించుటలో స్త్రీ పురుషులకు సమానహక్కు వున్నది. స్త్రీకిగాని, పురుషునికి గాని ఒకే పనికి ఒకే వేతనం వుండాలి. స్త్రీలకి, పిల్లలకి అనుకూలంగా లేని పనులలో వారిని ఉపయోగించుకొనరాదు.

1955 హిందుకోడ్ బిల్లు వారసత్వం, వివాహము, విడాకుల విషయంలో స్త్రీ పురుషులకు సమాన హక్కులు ఏర్పరచినవి. అయితే ముస్లిమ్ మహిళల హోదామాత్రం చాల తక్కువస్థాయిలో వున్నది. మహిళల హోదా పెంచుటకు ప్రభుత్వము కట్నం, వ్యభిచారాలకు వ్యతిరేకంగా చట్టములను ఏర్పరచినది. అయినప్పటికి, భారతీయ మహిళల ఆర్థిక సాంఘికహోదా చాలా తక్కువ స్థాయిలో వున్నది. స్త్రీలలో అక్షరాస్యులు తక్కువ అగుటచే వారిలో ఎక్కువమంది ఉద్యోగాలు చేయుటలేదు. భారతదేశములో అక్షరాస్యత శాతము 29.3 అయితే పురుషులలో ఈ శాతము 39.5, స్త్రీలలో 18.5 మాత్రమే. మహిళల హోదాలను పెంచుటకు తీసికొనవలసిన చర్యలను పరిశీలించుటకు ప్రభుత్వము 1971 సెప్టెంబరు 22న ఒక కమిటీని నియమించినది. ఈ కమిటీ తన నివేదికను ఇటీవల ప్రభుత్వమునకు సమర్పించినది.

సతీసహగమనము, బాల్యవివాహములు గతంలో భారతీయ మహిళలకు తీరని అన్యాయము చేసినవి. మన సంఘములో చాలా కాలముగా స్త్రీలు పురుషుల అధికారమునకు లోబడియుండుట జరిగినది. ఇటీవల కాలములో జాతీయస్థాయిలోను, రాష్ట్ర స్థాయిలోను కొన్ని ముఖ్యమైన పదవులను స్త్రీలు ఆక్రమించినప్పటికి దానిని బట్టి స్త్రీ పురుషుల హోదా సమానంగా ఉన్నది అని చెప్పుట పరికాదు. ఒక వ్యక్తి హోదా సంఘములో అతని విద్య, ఆర్థిక స్వాతంత్ర్యములపై ఆధారపడి యుండును. మన సంఘములో స్త్రీకి సంరక్షణ ఉద్యోగంద్వారా కాకుండ వివాహముద్వారా లభించుచున్నది. ఈ విధముగా ఆమె స్వాతంత్ర్యమును పోగొట్టుకొనుచున్నది. చాల కుటుంబాలలో భర్త ఒక్కడే సంపాదించుటచే భార్య పూర్తిగా అతనిపై ఆధారపడవలసి వచ్చెను. ఉదాహరణకు, మన దేశములో డిగ్రీలు ఉన్న స్త్రీల సంఖ్య 4 లక్షలు. అయితే 1.5 లక్షల స్త్రీలు మాత్రమే ఉద్యోగాలు చేయుచున్నారు.

మహిళలు ఆర్థికంగాను, విద్యాపరంగాను, వెనుకబడినవర్గతిగా ప్రభుత్వము ప్రకటించవలయును. అటువంటప్పుడు మాత్రమే ప్రస్తుతం షెడ్యూలు కులాలు, షెడ్యూలు జాతులవారికి ప్రత్యేక సౌకర్యములు ఏర్పరచినట్లే స్త్రీలకు కూడా ప్రత్యేక సౌకర్యములు ఏర్పరచవచ్చును. రాజ్యాంగములో నిబంధన 15 [3]లో స్త్రీలకు ప్రత్యేక సౌకర్యములు ఏర్పరచినప్పటికి వాటివలన ఉపయోగము జరుగలేదు. ఈ నిబంధనక్రింద స్త్రీ లందరికి ఉచిత నిర్బంధ విద్యను సమకూర్చవలయును. మన దేశములో మంచి హోదాలలో ఉన్న స్త్రీలు కూడా స్త్రీల అభ్యుదయమునకు కృషిచేయుటలేదు.

దురదృష్టవశాత్తు వివాహమే స్త్రీల ఏకైక లక్ష్యముగా పరిగణించబడుచున్నది. వివాహానంతరము వ్యక్తిగా స్త్రీకి ఎటువంటి స్వేచ్ఛ హోదాలేదు. వాస్తవంగా వివాహము స్త్రీకి ఎక్కువ అవకాశములు కల్పించవలసి యున్నది. కాని అలా జరుగుటలేదు. కూతురుగా కాని, భార్యగా గాని, తల్లిగా గాని స్త్రీ చాలా తక్కువ ఆర్థిక స్వాతంత్ర్యము అనుభవించుచున్నది. అందువలన సంఘములో తక్కువ స్థానమున్నది.

కేవలము ఉచిత నిర్బంధ విద్యను సమకూర్చుటద్వారా

---

రచయిత మచిలీపట్నం హిందూకాలేజిలో పోస్టుగ్రాడ్యుయేటు ఆర్థికశాస్త్ర శాఖలో లెక్చరర్.

మాత్రమే స్త్రీల హోదాలను పెంచలేము. ఉద్యోగాల విషయములో స్త్రీలకు ప్రత్యేక సౌకర్యములు ఉండవలయును. ఉద్యోగము చేస్తున్న స్త్రీ తల్లిగా ఎక్కువ బాధ్యతలను భరించుటచే ఆమెకు ఎక్కువ ఉద్యోగ భద్రత యుండవలయును. దురదృష్టవశాత్తు మన దేశంలో స్త్రీకార్మికులకు పురుషులకంటె తక్కువ వేతనము లభించుచున్నది. స్త్రీలకు చాలా తక్కువ ఆర్థిక స్వాతంత్ర్యము ఉండుటచే ప్రభుత్వమే వారు తమ హక్కులను అనుభవించుటలో సహాయపడవలయును. రాజ్యాంగపరంగా స్త్రీలకు కొన్ని హక్కులు ఉన్నప్పటికి, ఆర్థిక స్తోమత లేకపోవుటచే వారు కోర్టులకు వెళ్లి న్యాయమును చేకూర్చు కొనలేకపోవుచున్నారు.

మన సమాజంలో ముస్లిం స్త్రీలు ప్రత్యేక ఇబ్బందులను ఎదుర్కొను చున్నారు. చాలా కాలంగా వచ్చుచున్న కొన్ని ఆచారాలు వారు తమ వ్యక్తిత్వమును అభివృద్ధి చేసుకొనుటకు ఆటంకముగా ఉన్నవి. ముస్లిం సమాజము స్త్రీ పురుషులకు సమాన హక్కులు కల్పించలేదు. వివాహము, వారసత్వము విడాకుల విషయములో ముస్లిం స్త్రీలు అనేక ఇబ్బందులను ఎదుర్కొనుచున్నారు. ఇప్పటికి గూడా కొంతమంది ముస్లిం స్త్రీలు "పరదా" పద్ధతిని అవలంబించు చున్నారు. ఈ పద్ధతి వలన ముస్లింస్త్రీల పాత్ర కుటుంబమునకు మాత్రమే పరిమితమైనది. ఒక ముస్లింపురుషునకు నల్గురు భార్య లుండవచ్చును. ఇద్దరు సాక్షుల ఎదుట మూడుసార్లు "తలక్" చెప్పటద్వారా తన భార్యకు విడాకులు ఇవ్వవచ్చును. ఈ విషయములో కోర్టుకి ఎటువంటి సంబంధము లేదు. ముస్లింసమాజము స్త్రీలకు ప్రజాజీవనములో ఎటువంటిపాత్రను ఇవ్వలేదు.

స్త్రీల విషయములో వివక్షణ చూపుట మానవత్వాన్ని మంట గలుపుట మాత్రమే. సంఘము, కుటుంబము సంక్షేమం దృష్ట్యా కూడ ఇది ఎంత మాత్రము వాంఛనీయము కాదు. వేదకాలములో స్త్రీలకు ఎక్కువ స్వేచ్ఛ యుండెడిది. స్వయంవరములద్వారా ఈ విషయము మనకు తెలియుచున్నది. రానురాను స్త్రీ తన స్వాతంత్ర్యమును పోగొట్టుకొన్నది. ముఖ్యముగా పరదా పద్ధతి, సతీసహగమనము, బాల్య వివాహము, బహుభార్యాత్వము, బలవంతపు వైధవ్యము, వర కట్నం స్త్రీల స్వాతంత్ర్యమును రూపుమాపినవి. సంఘ సంస్కర ణలు, రాజ్యాంగపు హక్కులు స్త్రీహోదాని కొంతవరకు పెంచినవి. జాతీయ జీవితములో స్త్రీలు ఎక్కువగా పాల్గొనుచున్నారు. ఇటీవల కాలములో స్త్రీపోలీసులను నియమించుట గమనించతగిన విశేషము.

అయితే స్త్రీహోదాను పెంచుటలో అనేక ఇబ్బందులు లేక పోలేదు. 1973-74 లో ప్రతి 100 బాలురకు ప్రాథమిక పాఠ శాలలో 62 బాలికలు ఉన్నారు. ఉన్నత పాఠశాలలో 36 బాలికలు ఉన్నారు. కళాశాలలు విశ్వవిద్యాలయాలలో 31 బాలికలు వున్నారు. 1971 లో పార్లమెంటుసభ్యులలో 5.5 శాతము మాత్రమే మహి ళలు. స్త్రీలలో 85.28 శాతము నిరక్షరాస్యులు. పనులు చేస్తున్న వారిలో మహిళల శాతము 18 మాత్రమే. పనులు చేస్తున్న స్త్రీలలో 80 శాతము వ్యవసాయ రంగములో వున్నారు. నిరుద్యోగ సమస్య విపరీతముగా పెరుగుటచే స్త్రీలకు ఉద్యోగములు కల్పించుట సాధ్య పడుటలేదు. విద్యావతులై ఉద్యోగము చేస్తున్న స్త్రీలలో ౦0% ప్రాథమిక పాఠశాల అధ్యాపకులుగా ఉన్నారు. 15 శాతం మంది గుమాస్తాలుగాను, టైపిస్టులుగాను ఉన్నారు. వేరొక 15 శాతం మంది ఉన్నత పాఠశాల అధ్యాపకులుగా ఉన్నారు. 7 శాతం మంది నిరుద్యోగులుగా ఉన్నారు. 10 శాతం మాత్రమే ఉన్నత పదవులను ఆక్రమించిరి.

మనదేశములో చాలా వివాహములు తల్లిదండ్రులు ఏర్పరచినవి. తన జీవిత భాగస్వామిని ఎన్నుకొనుటలో స్త్రీకి స్వేచ్ఛలేదు. ప్రేమ వివాహములను వ్యతిరేకించే తల్లిదండ్రులుకూడా తమ కుమార్తెల వివాహ విషయములో తగుశ్రద్ధ తీసికొనుట లేదు. స్త్రీహోదాను పూర్తిగా తగ్గించుటకు ఒక ముఖ్య కారణము వరకట్నము. దీనికి వ్యతిరేకంగా ప్రభుత్వం 1961లో చట్టము ఏర్పరచినది. అయినను సాంఘిక అన్యాయమునకు కారణమైన ఈ వరకట్నపు పద్ధతి రూపు మాపుట జరగలేదు. వరకట్నము ఆడపిల్లలతల్లులపై మోయరాని భారము వేసినది. నిత్యజీవనము గడుపుటే కష్టము అగుచున్న ఈ రోజులలో కుమార్తెల తల్లిదండ్రులు వరకట్నము ఇవ్వలేక అనేక బాధలు పడుచున్నారు. మెట్రిక్యులేషన్ చదివిన వ్యక్తికి గూడ 5,000 వరకు వరకట్నము లభించుచున్నది. విచిత్రమేమిటంటే ఎక్కువ విద్యనభ్యసించిన బాలికకు ఎక్కువ కట్నమును ఇవ్వవలసి యున్నది. పురుషుల దృక్పథములో మార్పురానిదే వరకట్నమును రూపుమాపుట జరుగదు. వరకట్నం క్రొత్తగా పెళ్లయిన కుటుం బము వారికి ఆర్థిక స్తోమత సమకూర్చునని ఒక వాదన. అయితే ఇది సరిఅయిన వాదన కాదు. కష్టపడి డబ్బు సంపాదించవలెనే గాని ఆడపిల్లల తలిదండ్రుల కష్టార్జితము అనుభవించ ప్రయత్నించుట అన్యాయము. కుమారుల విద్యకై తల్లిదండ్రులు చాలా ఖర్చుచేయుట వలన కట్నము పొందేహక్కు వారికి ఉన్నదని వారి వాదన. అయితే ఈ వాదన గూడా సరిఅయినదికాదు. విద్యను పొందుట ఉద్యోగము సంపాదించుటకు గాని కట్నము సంపాదించుటకు కాదుగదా! చదువు నభ్యసించి ఉద్యోగము సంపాదించిన ప్రతీవ్యక్తి తల్లిదండ్రులను తానే పూర్తిగా చూసుకొనవలయును. విద్యకై చేసిన ఖర్చుకు తగిన ప్రతి ఫలం కుమారులవద్దనుండి పొందవలెనేగాని ఆడపిల్లల తల్లిదండ్రుల

నుండి కాదు. వరకట్నాన్ని పూర్తిగా నిర్మూలించనిదే స్త్రీలకు సాంఘికన్యాయము చేకూర్చుట సాధ్యపడదు.

స్త్రీల హోదాను పెంచుటకు రెండే రెండు ముఖ్యమైన మార్గములున్నవి. సాంఘిక ఆలోచనలలో, దృక్పథములలో పూర్తిగా మార్పు తెచ్చే సాంఘిక విప్లవము కావలయును. స్త్రీయొక్క వ్యక్తిత్వమును గుర్తించుటకు సంఘము కృషిచేయవలయును. రెండవ మార్గము స్త్రీలు తమ హక్కుల కొఱకై పోరాడునట్లుగా మన విద్యా విధానమును మార్చవలయును. అభ్యుదయకృషికి ఎక్కువగా తోడ్పడేది సాంఘిక దృక్పథము అయితే మన దేశములో సాంఘిక పరిస్థితులు మతముపై ఎక్కువగా ఆధారపడుచున్నవి. ఉదాహరణకు ఒక వ్యక్తికి మోక్షము తనకుమారుడు చేసే కర్మలపై ఆధారపడునని మతము చెప్పుచున్నది. అందువలన బాలురు పుట్టుట అదృష్టము గాను, బాలికలు పుట్టుట దురదృష్టముగాను పరిగణింపబడుచున్నది. చాలాకాలముగా వచ్చుచున్న ఆచారములను పోగొట్టుట కష్టము. అవకాశములు ఉన్నచో స్త్రీలు పురుషులకు ఏమాత్రము తీసిపోరు. ఉదాహరణకు అక్షరాస్యత ఉన్నవారిలో పురుషులకంటె స్త్రీలే ఎక్కువ పుస్తకములు చదువుచున్నట్లు ఇటీవల National Book trust పరిశీలనవల్ల తెలిసినది. స్త్రీలను పురుషులు తక్కువగా చూచినంత కాలము స్త్రీల పరిస్థితులు మెఱుగుపరచుట సాధ్యపడదు. స్త్రీలు తమ న్యాయమైన హక్కులనుఆనుభవించుటకు సంఘమేఅవకాశములను కల్పించవలెను. స్త్రీలకు అన్యాయము చేసినంతకాలము సాంఘికాభ్యుదయమును సాధించుట అసంభవము. స్త్రీల హోదాను పెంచుటలో పురుషులు ప్రభుత్వము సంఘము కలసికట్టుగా కృషిచేయవలయును.

# సూక్ష్మస్థూలాలు

శ్రీ వసంతరావు వేంకటరావు

సూక్ష్మ స్థూలాల ఎరుక
స్థూలంగా నైన లేదు.
స్థూలం తారాలోకం
సూక్ష్మం పరమాణులోక
మా రెండిటి విజ్ఞానం
అంతంతగ మనకున్నది !
మనుజులట్లు పుట్టుచుండు,
మనుచుందును, గిట్టుచుండు
తారలు, తారాచరిత
మ్మత్యంతాశ్చర్యకరము !
ఒక్కతారనో వాగా
ఒక్కప్పుడు ప్రేలుచుండు,
తారొక్కటి శోణబృహ
త్తారగ రూపొందుచుండు,
శ్వేత వామనునిగా కుం
చించు కొనుచు వేరొక్కటి.
సత్యము, తారా చరిత
మ్మత్యంతాశ్చర్యకరము.
మొదట కొద్దిగా నుండిన
మూలకణాల్ సంఖ్య యేమొ
పదిపదులుగ పెరుగుచున్న
పథకము గుర్తింపనెంచి
విజ్ఞానులు చేయుచున్న
యజ్ఞ ఫలం చిందలేదు.
సూక్ష్మ స్థూలాల ఎరుక
స్థూలంగా నైన లేదు!

# ఆవంచ

## శ్రీ కే. కిశోరుబాబు
## శ్రీ కే. అశోకుబాబు

ఉల్లోల సురధునీ కల్లోల మాలికా
ప్రతిభట ధ్వజ పట ప్రాభవంబు
నానా మహాసౌధ నవసుధా చంద్రికా
ధగధగాయిత నభోదర్పణంబు

ఖేచరదంపతి లోచనానందన
వందన మాలికా వైభవంబు
ప్రాకార కీలిత బహురత్న దీపికా
విహిత విక్రమ దిశావిలసనంబు

వివిధ శృంగార వనమహీ విహరమాణ
మంద పవమాన వలమాన మానితంబు
రమణ రమణీ సమాకీర్ణ రాజమాన
భరిత విభవం బవంచక పురవరంబు

ఈ పద్యము విక్రమార్కచరిత్రలోనిది.

ఇందలి ఉల్లోల సురధునిని మీనాంబరిగా భావించిన ఈ పద్య మచ్చముగా ఆవంచకు సరిపోవును; మీనాంబరికి 'గంగ' యని పేరుండె ననుటకు దాని తీరమున నిలిచిన గంగాపుర మొక సాక్ష్యము. విక్రమార్క చరిత్రయందు జక్కన కాశి, గయ, ప్రయాగ, ఏరేశ్వరము, సంగమేశ్వరము, శ్రీశైలము, అహోబిలము, సిద్ధవటము, కాళహస్తి, వెంకటాచలము, కంచి, శ్రీరంగము, కుంభఘోణము, రామేశ్వరము, సేతుబంధము, అనంతశయనము, విరూపాక్షము అను 17 తీర్థయాత్రలను, మధుర, చంద్రపురము, ఉజ్జయిని, విదర్భ, సిద్ధపురము, పుష్పపురము, శాలాపురము, వేత్రవతీతట పట్టణము, నాగాపురము, ఆవంచకపురము, విక్రమసింహపురము, వివేక నిధానము, మహాఘోషము, ధర్మస్థలము, సుధర్మ అను 15 పట్టణములను పేర్కొనెను.

యాత్రలుగా 17చెప్పినప్పటికి అందు కాశికి పిమ్మట సంగమేశ్వరము, శ్రీశైలము, అహోబలము, సిద్ధవటము, కంచి, విరూపాక్షము అను 6 మాత్రమే ప్రత్యేక పద్యములందు జెప్పెను. అటులే పట్టణములు 13 చెప్పినను వానిలో మధుర, ఉజ్జయిని, శాలాపురము, వేత్రవతీతట పట్టణము, నాగాపురము, ఆవంచక పురము, విక్రమసింహపురము అను 7 మాత్రమే ప్రత్యేక పద్యము లందు జెప్పెను.

పై యాత్రలందు సంగమేశ్వర, శ్రీశైల, అహోబల, సిద్ధవట, విరూపాక్షములు కడప కర్నూలు మండలములకే జెందినవి. జక్కన పేర్కొనిన 17 యాత్రలలో అతనికి వానిపైననే అభిమాన మెందులకో!

పట్టణములను జూచిన మధుర, ఉజ్జయిని ఈరెండు తీర్థయాత్రలు. వేత్రవతి అతడు కేవలము సైన్యముకొఱకు సృష్టించిన తత్కాలిక శిబిరము. ఇక మిగిలిన వానిలో శాలాపురము నొక కందమున, నాగపురము నర్ధచంపకమున ముగించి ఆవంచికా, విక్రమ సింహపురములకు సీసము ఉపయోగించుటలో నేదో విశేష ముండక పోదు.

ఇందలి విక్రమసింహ పుర వర్ణనను బట్టి ఆరుద్రగారు జక్కనగారి తాత నెల్లూరి తిరుకాళవిభుని మెప్పించి బహుమతులు వడసెను గనుక, అతడుగూడ నెల్లూరివాడే కావచ్చునని ఊహించిరి.

నెల్లూరిని పాలించిన చోడులు పొత్తపి శాఖకు జెందినవారు. పై శాసనకర్తగూడ పొత్తపిశాఖకు చెందినవాడే కనుక తాతగారి ననుసరించి నెల్లూరి చోడుల సంబంధ మెఱిగిన జక్కన వారి రాజ ప్రతినిధి పురమగు ఆవంచ వర్ణించె నేమో!

అచటి మూలస్థానదేవరకు గావించిన దానమును దెల్పెడు ఇరుగణచోడుని శాసన మొకటి అచట నున్నది. ఇరుగణచోళుడు త్రిభువన మల్లుని కాలమునకు చెందినవాడు. కరికాలవంశమునకు జెందిన పొత్తపి శాఖవాడు. ఆతడు పశ్చిమచాళుక్యరాజగు త్రిభువనమల్లుని సామంతుడు. శాసనమున అతని ప్రశస్తి లేనందువలన అప్పటికి ఇరుగణ చోళుడు పశ్చిమచాళుక్యుల సామంతత్వ మంగీకరించెనో లేదో యని యనుమానము.

చోళుల పిమ్మట అవంచ పశ్చిమచాళుక్యులకు వశమయ్యెను. క్రీ. శ. 1113 ప్రాంతమున త్రిభువనమల్లుని కుమారుడగు కుమార తైలపు డిచటినుండి తెలంగాణమును పాలించెను. కనుక అప్పటి యాధారములనుబట్టి అవంచ క్రీ. శ. 1000 నుండి 1400 వరకు రాజప్రతినిధి పట్టణముగా వర్ధిల్లినట్టు చెప్ప నవకాశ మున్నది.

ఆ కాలమున అటు సాగరసీమయందు నెల్లూరు, ఇటు తెలంగాణమున అవంచ సమకాలీనమై ప్రసిద్ధి చెందిన పట్టణములు గావచ్చును. అవంచ పశ్చిమ చాళుక్యుల కాలమున ఒక వెలుగు వెలిగిన పట్టణము. అచటి కేదారేశ్వరాలయ శిల్పము ముమ్మూర్తుల గంగాపుర శిల్పమును బోలియుండును. ఆ యాలయమున కేదారేశ్వర ప్రతిష్ఠ నేలమాళిగ యున్నది. అంతేగాక నిచట నుగంత గణపతిమూర్తి యున్నది. త్యాగరాజుగారు వాతాపిగణపతిని దర్శించెను గాని ఈ గణపతిని జూచిన నితనినే కీర్తించియుండును. బహుశా ఇంతటి బృహద్గణపతి మరెచట నుండడేమో! ఈ గ్రామమున పెక్కాలయము లుండెను. నే డన్నియు శిథిలములైనవి. ప్రస్తుత మూరి వెలుపల నున్న హనుమదాలయము ముందు ధ్వజస్తంభముపైన నలువైపుల శివపంచాయతనమందలి నాలుగుమూర్తులు చెక్కబడి యున్నవి. ఊరి ముందర భైరవ మరియు చండీవిగ్రహము లున్నవి. వానితలలు విరియ బోసి కొన్నట్లు చెక్కబడినవి. మరియొకచోట మహిషమర్దని యున్నది. ఇచట శిల్పములందు పట్టపుటేనుగు లొక ప్రత్యేకత. అట్టివి నాలుగు జత లుండెనట. అవి నాలుగాలయముల ద్వారముల ముందుండెనట. నేడవి యన్ని శిథిలములైనవి. ఒక ఏనుగులజత మాత్రము గ్రామము నందలి గ్రంథాలయముముందు నిలుపబడియున్నది. ఈ ప్రాంతమున పాపకల్లు మున్నగు పెక్కు స్థలములందు పెద్ద పెద్ద గణపతి మూర్తు లున్నవి. ఇక్ష్వాకులు కార్తికేయుని భక్తులు గనుక ఆ తరువాతవచ్చిన చాళుక్యులు గణపతిని యిష్టదైవముగా గ్రహించిరేమో! ఇచట భ్రమరాంబాదేవిగూడ నున్నది. ఆ దేవి యిచట వెలసినపు డొక బ్రాహ్మణయువతికి తా నావేశించి మహాత్మ్యములు ప్రదర్శించి వెలసినటుల అవంచ భ్రమరాంబ పంచవింశతి అను స్తుతివలన దెలియును. అందు 28 పద్యము లున్నవి. అది అముద్రితము. తత్కర్త పట్వారి కవి. అతని ఇంటిపేరు పులిజాలవారు. తండ్రిపేరు నరసింహమయ్య. తల్లి మహాలక్ష్మమ్మ. వారు సూర్యగోత్రమునకు జెందినవారు. యజుశ్శాఖీయులు. సూర్యగోత్రమగుటవలన నితడు క్షత్రియ కులజుడు.

ఇటుల ఈ ప్రాంతమున అవంచకు స్థలప్రాధాన్య మున్నది గనుక జక్కనకాలమునాటి కిది వైభవములో విరాజిల్లుచుండెనేమో! లేకున్న విక్రమార్కచరిత్రయందలి రాజశేఖరుని కథకు మూలమైన కథాసరిత్సాగరమున విక్రమకేసరి (రాజశేఖరుడు) పట్టణము పాటలీపుత్ర మనియుండ దానిని ఆవంచిగా మార్చితెలుగుదేశమును జూపింప నవసరము జక్కనకు లేదని తోచును. జక్కన తీర్థయాత్రలందు గూడ తెలుగుదేశమునే చూపనెంచెనేమో! పరిశీలింపవలెను. ఇది ఊహామాత్రమే! ఇందేమైన సత్యమున్న దానిని పరిశోధకుల దృష్టికి తెచ్చుటయే మా యీ వ్యాసోద్దేశము.

---

# కోకిలల విలాపం

(శ్రీ బి. థియడోర్)

నవ వసంత మిక రాదా ? నందనవన మిక చిగుర్చదా ?
గండు కోకిలలు నేడు స్వేచ్ఛగా గానం చేయగ లేవా ?
కొమ్మలపైన కమ్మకమ్మగా కొసరికూతలు కూయగలేవా ?
పరభృతాలపై వనాధినేతలు పరిపాలన చేస్తారా ?
పాలకులు శాసించిన యట్లే పాటలు ఇపు డవి పాడాలా ?
కాకుల గోలలో కోకిల పాటలు కర్ణామృతము అవుతాయా ?
బోయవాళ్లు కోయిలల కోసమై పొంచుకు కూర్చున్నారా ?
కోకిల లీ విషమస్థితిలో తమ గొంతుక లెత్తి కూస్తాయా ?
నిషాదులు కోకిల జీవితాల విషాదాంతమే చేస్తారా ?
పలుకరించే దాతలు లే రని పరదేశాలే పోవాలా ?
ఎండిపోయిన చెట్లమీదుగా నవి ఏడుస్తూనే ఎగురాలా ?
మేతమేయ లేచిపుళ్లు లేవు, అవి కూతమాత్రం కూయాలా?
నవవసంత మిక రాదా ? నందనవన మిక చిగుర్చదా ?

---

# రొట్టె

కన్నడ మూలం: శ్రీ పి. లంకేశ్

అనువాదం: శ్రీ ఘట్టమరాజు అశ్వత్థనారాయణ

వేసవి. నీడ ఉన్న చోటెల్లా మనుష్యులు, తేమ వున్నచోటెల్లా ఈగలు. సింగారపేట స్టేషనులో వారం క్రితం దిగినప్పుడు అటూ ఇటూ తిరిగే కూలీలను, చినిగిన బట్టలతో, కంపుకొట్టే శరీరాలతో చంకలో బిడ్డలను ఎత్తుకొని తిరిగే స్త్రీలను—స్టేషన్‌నిండా వున్న ఇలాంటివారిని కాని—గోడలపైన తనకు అర్థమవని రంగు రంగుల చీటీలు, తిట్లు వేటినీ ఆమె సరిగా గమనించి వుండలేదు. స్టేషన్ వెనుక ఒకవైపునుంచి నేలనుండి నింగిదాకా పైకిలేస్తున్న పొగను కూడ ఆమె చూడలేదు. ఊళ్లో కాలిడగానే లెక్కలేనన్ని వూరేగింపులు. అలాంటి కొన్ని వూరేగింపుల్లోని బ్యానర్లను, బోర్డులను ఆమె అర్థం చేసికోవాలని ప్రయత్నించింది కాని సాధ్యం కాలేదు. బాలింతగావున్న కూతురితో చర్చించాలని ప్రయత్నం చేసింది. కాని కూతురు బెదరినట్లగుపించింది. తన భర్తగురించి అమ్మ అడగాలని ప్రయత్నిస్తున్నదని. ఆమె ఏదో సమాధానం చెప్పి వూరకుండి పోయింది. అల్లుడు ఆఫీసునించీ రాగానే మాట్లాడేందుకు అవకాశం ఇవ్వకుండానే వెళ్లిపోయేవాడు. తాను తెచ్చిన తిళ్ళూ—ఫలహారాలు కూతురికి ఇచ్చి, ఓవారం ఆమెకు సేవలు చేసి చిన్న ట్రంకు, సంచీ చేతబట్టుకు వూరికి బయలుదేరింది. దారిలో తినేందుకని కూతురు పళ్ళూ—రొట్టెలు కట్టియిచ్చింది.

కూతురు ఇంటికీ—స్టేషనుకూ దూరం నాల్గు మైళ్లు. మల మల మాడ్చే ఎండలో ఒక్కతే నడిచిపోవటం కష్టమనిపించి బండి కట్టించుకొని పోవాలనుకుంది. కాని రెండు రూపాయలు బండివానికి తగలెయ్యటం ఇష్టంలేక నాల్గుమైళ్ళూ నడిచే వెళ్లింది.

“నిల్చుకోవటానికి కూడా సరియైన స్థలం లేదు. ఇదీ వొక స్టేషనేనా? ఈ భాగ్యానికే నాలుగుమైళ్లు నడిచివచ్చాను. అంతా నా ఖర్మ!” అని తన్ను తాను నిందించుకొంటూ కిటకిటలాడుతున్న ప్లాటుఫారంమీద కంబాని కొరిగి, ప్రక్కనున్న మనిషికి వినపడేలా గొణిగింది. కాని ఆ మనిషి ఉలుకూ—పలుకూ లేకుండా అలానే నిల్చున్నాడు. కాలిమీద పడవున్న చీమిడిపై ఈగలు ముసరగానే ఆమె కదోలా అయింది; అసహ్యమేసింది, చుట్టూ కలయచూసింది. ఎక్కడికి వెళ్లినా ఈ పీడ తప్పదని భావించి వూరకనే నిల్చుండిపోయింది. పొదలా పెరిగిన జుత్తుతో, విగ్రహంలా నిల్చునివున్న ఆ వ్యక్తి గురించి తెలుసుకోవాలని ఆమె తహతహ లాడింది. తలనుంచి వేలాడే పొడవైన వెంట్రుకలు, భుజాలనుంచీ కాళ్ళవరకూ జీరాడుతూన్న ఆకుపచ్చని మాసిన బట్ట......

ఆ వ్యక్తి ధ్యాసను తనవైపు త్రిప్పాలని దగ్గింది.

ఆ ఆకారం నిదానంగా, యాంత్రికంగా మెడ త్రిప్పి చూసింది, స్త్రీ కాదు; పురుషుడే. జ్వరంవల్ల పీక్కుపోయిన ముఖం, కళ్ళ చుట్టూ పెద్దగుంటలు, లెక్కలేనన్ని గీతలు, కోపం — బాధ సమ్మిళితమైన మొగం. అతన్ని పలకరించటానికి ఆమెకు సంకోచం వేసింది. తన ట్రంకు, సంచిని మెల్లగా దగ్గిరకు లాక్కొని, కంబం దగ్గిరనుంచి కొంచెం దూరం జరిగింది. కాని ఆ వ్యక్తికూడా కొంచెం ఆమెవైపు జరిగి ఆమెకళ్లలోకి నేరుగాచూడసాగాడు. ఆమె ఇంకోవైపు చూడాలని ప్రయత్నించింది. కాని అలా చేయలేకపోయింది. అక్కడి నించీ వెళ్లిపోతే అతడు వెంబడిస్తాడేమో అనే భయం. చుట్టు ప్రక్కల జనులు తిరుగుచున్నారు. ఆమె ఆరాటం లెక్కపెట్టకుండా జనులు తను పనులమీద తాము వెళ్ళుచున్నారు. వాళ్లలో కొందరిని ఆపి, వారికి ఆ వ్యక్తిని గురించి చెప్పాలనిపించింది ఆమెకు. అయితే ధైర్యం చాలలేదు. అయింది కాని లెమ్మని మొండిధైర్యంచేసి నిల్చుండి పోయింది. కంబాల దగ్గిర పెట్టే—బేడా పెట్టుకొని తనలాగే ఎంతో మంది ఎదురు చూస్తున్నారు. గబ్బు మనుష్యులు, ఎక్కడ పడితే అక్కడ కూర్చునేవాళ్ళు, ఉమ్మేసేవాళ్లు, చూడలేక తల తిరిగినట్లయింది. రైలురాకడను సూచించే గంట మ్రోగింది. రైలు ఏవేళకు వస్తుందో ఎవర్నైనా అడగాలనిపించింది. కాని మాటలు పెగలలేదు. గేటుప్రక్కనేవున్న బోర్డుమీద ఎవరో రైల్వేనౌకరు అదేమో వ్రాస్తున్నాడు. అది వ్రాసి వెళ్లినతర్వాత కనిపించింది. “ఈరోజు రైలు ఒక గంట ఆలస్యం” అని.

ఆ మనిషి ఇంకోవైపు చూడసాగాడు. ఆమెకు కొంచెం నెమ్మది కలిగింది. సాధ్యమైనంత త్వరలో ఊరు చేరాలని, పిల్లలను చూడాలని ఆమె ఆశపడింది. కడుపులో కొక్కులు తోడుతున్నాయి. పదిమందిముందు తినే అలవాటు లేదు. అయినా ఇప్పుడు ఆత్మారాముడు

గమనించే స్థితిలో లేడు. ఆమె మెల్లగా సంచి తెరచి రొట్టెలను బయటికి తీసింది. వాటిలో రెంటినయినా చిన్నపిల్లవానికై దాచి వుంచాలని ప్యాకెట్టు విప్పి తొడపై ఉంచుకొంది. ఒక రొట్టెను ప్రక్కనపెట్టి మిగతావాటిని కాగితంలో చుట్టిపెడుతూ వుండగా... పొడవైన వెంట్రుకలవ్యక్తి నాలుగంటే నాలుగు గజాలదూరంలో నిల్చొని కళ్లింతగా చేసుకొని చూస్తున్నాడు. ఆమెరొట్టెలవైపు ఆకలిగా చూస్తున్నాడు. ఆమె వాని కొక రొట్టె ఇస్తామా అని చూసింది. కాని ఇచ్చిన తర్వాత, వాడెక్కడ శనిలా దాపురిస్తాడో అని భయపడి మిన్నకుండిపోయింది. అందువలననే గబగబా రొట్టెలను పొట్లం కట్టుతూండగ అతడు ఆమెవైపు దుమికి రొట్టెలన్నింటిని లాక్కొని గబగబా తినసాగాడు. కనుమూసి తెరచేంతలో జరిగిపోయిన ఘటనకు ఆమె అదిరి, లేచి నిలబడింది. "అయ్యో, దొంగ! దొంగ! పట్టుకోండి" అని అరచింది.

ఒక్కొక్కరుగా జనులు ఆమెచుట్టూ మూగారు. ఆ గుంపు లోంచి పల్చని, ఎత్తైన, క్రూరమైన చూపులు గల వ్యక్తి ఒకతను ఆమెనే చూస్తూ నిలుచుండి "ఏమైంది?" అని అడిగాడు.

భయంతో వణుకుతూ ఆమె "ఈ మనిషి......దొంగిలించాడు...నా...నా...నా..." అని చెప్పింది.

"ఏం దొంగిలించాడు?"

రొట్టె దొంగిలించాడు. అతడు తింటున్నాడే... అది నా రొట్టె. ఆ మనిషి, పొడవైన వెంట్రుకలవ్యక్తి ఆపురాపురుమంటూ రొట్టెను కొరికితింటూ, సగభాగం ముగించాడు. అతనికి ప్రపంచంధ్యాసే లేదు. తొడలను కూడా కప్పలేని పంచె, ఏవ కనపడే లంగీ, జడలుకట్టి వేలాడుతున్న వెంట్రుకలు మురుచగడ్డం. చుట్టుప్రక్కలవినపడుతున్న రణగొణను అతడు గమనించే స్థితిలో లేడు. అతనిలోకమే అతనిది. కొంతమంది ఏమేమో గొణిగినొన్నారు; మరికొంతమంది ఎక్కడినుంచి వెళ్లిపోయ్యారు; మరికొంతమంది తటస్థులుగా ఉండిపోయారు. పల్చగా, పొడుగ్గా, క్రూరమైన కళ్లు గల ఆ మనిషి అడిగాడు. "ఆమాత్రందానికే ఇంత రాద్ధాంతం చేయాలా? ఎందుకు దొంగిలించాడో తెలుసుకదా?"

అతనిప్రశ్న విని కొంతమంది నవ్వారు.

ఆమెఅసహాయత ఎక్కువ కాసాగింది. ఆమె పండుటాకులా వణకసాగింది. సత్తువంతా కూడగట్టుకొని ఆమె చెప్పింది. "అంత! మాత్రం తెలియదా? నా దగ్గర్నుంచి అతడు దాన్ని లాక్కున్నాడు."

"అతనికి ఆకలిగా వుందేమో?" బాణంలా దూసుకు వచ్చింది జవాబు.

ఆకలయిందట! అందుకే లాక్కొన్నాడట! సరైసమాధే!

అల్లికల్లోలంగా, చీకాకుగా వున్న మనస్సు ఏమైనా జవాబు చెప్పాలని ఆరాటపడింది. అందుకే ఇలా అంది! "అడిగితే ఇచ్చేదాన్నిగా. లాక్కోవాల్సిన......" ఆమెమాటలు చుట్టుప్రక్కల రణగొణలో లీనమైపొయ్యాయి. జనులు నవ్వారు. కేకలేశారు. ఆమెగొంతులో, గుండెలో వేడిసెగలు. లోకుల వ్యంగ్యబాణాలకు తట్టుకోలేక చెమరుస్తోంది. వెడల్పాటి కళ్ళుగల, బక్కపల్చటి మనిషి బిగ్గరగా అడిగాడు. "మీలాంటివాళ్ల సంగతి తెలుసమ్మా. ఇది ఈనాటి కథ కాదు. మా దగ్గర ఎందుకీ డాబులు. నీ బిడ్డమీద వొట్టేసి చెప్పు. అతడడిగి వుంటే నిజంగా ఇచ్చివుండేదానివా?"

"ఒట్లకేమయ్యా? ఎన్నైనా పెట్టుకోవచ్చు" ఇంకో అతను పలికాడు.

అబలకు సాయం చెయ్యకుండా కంతిరీ కుక్కలవలె ఎగతాళి చేయడం చూచి ఆమెకు ఎక్కడ లేని కోపం వచ్చింది. తాను చచ్చినా ఫరవా లేదని ధైర్యం తెచ్చుకొని అరచింది. "నన్ను ఒట్టుపెట్టమని అడగటానికి నీవు ఏ వూరి దానప్పవయ్యా? నా కిష్టమైతే ఇస్తా—లేకపోతే లేదు, ఆడదాని చేతుల్లోంచి లాక్కొని ఆ కుక్క తింటూ వుంటే నన్ను తిట్టడానికి మీకు సిగ్గులేదా? మీ కెవ్వరికీ భార్యాపిల్లలు లేరా? ఛ! కుక్కల్లారా! పొండి! పొండి!

"అయితే, మేమంతా కుక్కలమా ?"

"లేకపోతే ? అడ్డం తీయండి. నన్ను ముట్టొద్దండి."

"కుక్కలకు పెండ్లాం—పిల్లలెందుకమ్మా ?"

"ఆ ముండమూతిమీద గుద్దండ్రా."

"దానిపొగరు చూడండ్రా."

"నన్ను తాకారంటే చెప్పుతో కొడతాను జాగ్రత్త! దూరంగా పోతారా లేదా ?... ... " అంటూ ఆమె తన స్వరాన్ని పెంచింది. అయ్యో! అని అరచింది. ఛీత్కారం చేసింది. జనుల త్రోపిడికి ట్రంకు, సంచి కనులకు కనపడకుండా జరిగిపొయ్యాయి. లెక్కలేనంతమంది ఆమెచుట్టూ మూగారు. గుమిగూడి నవ్వారు ... ... ఎగతాళి చేశారు. చప్పట్లు తట్టారు. వేలాదికళ్ళు ఆమెవే చూస్తున్నాయి. అటాంటి అనుభవం ఆమె కదే మొదటిసారి. బట్టలు విడిచి నిలబడినంత సిగ్గనిపించింది. నలువైపులనుంచి మనుష్యులు తోస్తూ వుంటే శీలం ఎక్కడ పోతుందోననే భయం కలిగింది. అప్పుడే గుంపులోంచి గుసగుసలు, గుజగుజలు బయలుదేరాయి. ఇంతలో ఎవరో 'పోలీస్' అని అన్నారు. ప్రజలను తోస్తూ వస్తూన్న పోలీసు దూరంలో కనబడ్డాడు. ఆమె ప్రాణం కాస్త కుదుట పడింది. భయం ఏడ్పుగా మారి, నిస్సహాయత అధికమై, బిగ్గరగా ఏడ్చింది. పోలీసు పెదవులు త్రిప్పుకుంటూ, ఏమో అడుగుతూ, గబగబా వచ్చాడు. అతనిముఖంలో రాహుకళ తాండవిస్తూంది. దగ్గరకు వచ్చీ రాగానే, ఆమెచేతుల్లోంచి సంచి లాక్కొన్నాడు. బిచ్చగాని దగ్గిరనుంచి రొట్టె లాక్కొని, లాఠీతో వానితలపై ఒకటి అంటించాడు. జనులు గప్‌చిప్‌గా నిలబడి వున్నారు. దెబ్బపడగానే, రొట్టె దొంగిలించిన వానికి కోపం నసాళానికి ఎక్కింది. కోపం కార్యరూపంలో మారేలా అగుపడింది. బికారికి పోలీసు మరొకటి తగిలించాడు. రక్తం చిమ్మింది. అతడు తడబడుతూ నిల్రదొక్కుకో గలిగాడు. పోలీసుకుకూడా భయం వేసిందేమో. "వెళ్లండి సార్, వెళ్లిపొండి." అని అందర్నీ లాఠీతో తోయసాగాడు.

ఆమె దొంగవైపే చూస్తూ వుండిపోయింది.

బికారితలనుంచి రక్తం కారుతూ వుంది. జనులు పోలీసు లాఠీని పట్టుకొని "అతన్ని ఎందుకు కొట్టేవు" అని నిలదీసి అడిగారు.

ఇక పోలీసు ప్రజలచేతుల్లో పడి నుగ్గు నూచయి పోవడమే ఆలస్యం—

"కొట్టొద్దండి. ఎవర్నీ కొట్టొద్దండి" అన్నది ఆమె. రక్తం కారుతూన్న 'దొంగ' దగ్గరకు పోయి, అతన్ని తాకాలనిపించినా తాకలేక, సంకోచపడుతూ, వణుకుతూ తన ట్రంకూ, సంచికోసం వెదకింది. పోలీసు భయపడి కదలకుండా నిలబడిపోయాడు. "అమ్మా! ఈ రామాయణమంతా మీవల్లే జరిగింది. ఇక్కడినుంచీ వెళ్లిపొండి. మీవంటివాళ్లనుంచి మాకు తలతిక్కవస్తుంది." అంటూ ప్రజల మెప్పు సంపాదించాలని పోలీసు ప్రయత్నించాడు. కాని ఆమె వెళ్లలేకపోయింది. సంచిలోని పళ్లను తీసికొని ఆ 'దొంగ' మనిషికి, అక్కడ గుమిగూడి వున్నవాళ్లందరికీ ఇవ్వాలనుకొంది. సంచిలోంచి పళ్ళు, వాటితోపాటువున్న స్నో, పౌడరు, మేజోళ్ళు, ఆటసామానులు—అన్నింటిని తీసి అందరికి పంచిపెట్టాలని అడుగు ముందుకు వేసింది. తీసికొనమని మూగసైగ చేసింది. కాని ఎవరూ తీసికోలేదు. "క్షమించండి." అని అనాలని ప్రయత్నించింది. నోట్లోంచి మాటలు పైకి రాలేదు. సత్తువలేని చేతుల్లోంచి పళ్ళు, మేజోళ్లు, ఆటసామానులు అన్నీ క్రింద పడ్డాయి.

అప్పుడు దూరంనుంచీ విజిల్, మిలిటరీ సైరన్ వినపడింది. జనులు భయపడి చెల్లాచెదరు కాసాగారు. గుంపులోంచి తప్పించుకోవడం అంత సులభమేంకాదు. ప్రజలు త్రోసుకులాడ్డం ప్రారంభిం

చారు. అంతవరకు తటస్థంగా ఉన్న పోలీసు కొత్తశక్తి, చైతన్యం పుంజుకొని జనులను లాఠీతో చావబాదసాగాడు. ఆమె "కొట్టొద్దండి, కొట్టొద్దండి" అని అరచింది. కాని ఆమెఅరపు ఎవ్వరికీ వినపడ లేదు.

రిజర్వుపోలీసులు జనులపైకి వేటకుక్కల్లా దుమికారు. "ఈ మనుషులు ఎప్పుడూ ఏదో వొక గొడవ చేస్తూనే వుంటారు. రండి. ఇక అందరూ తొలగిపోతారు" అంటూ పోలీసువాడు ఆమె రెక్క పుచ్చుకొని లాగాడు. పోలీసు తన చెయ్యిని ఆమెవీపుమీదుగా పోనిచ్చి, ఆమెచనుమొనలను నలపసాగాడు.

"నేను రాను. మీరు వెళ్ళిపోండి. నా మానాన నన్ను పోనివ్వండి" అని అన్నది. కాని పోలీసు ఆమెను విడిచేస్తేనా? అతడు చెమర్చిన ఆమెరొమ్మును తన రొమ్ముతో వొత్తాడు "నీకు తలకాయ సరిగ్గా వుందా లేదా? రా తల్లీ—మా ప్రాణంమీదికి వస్తుంది. మాట్లాడక రా." అన్నాడు పోలీసు.

రిజర్వు పోలీసులు వీరావేశంతో విజృంభించారు. జనులు దూరంగా పోయి నిల్చుకొని క్రౌర్యం, ప్రతీకారం ప్రజ్వరిల్లే కళ్ళతో చూస్తున్నారు. కాని రొట్టెదొంగ అదే స్తంభంవద్ద నిల్చుకొని తల పగిలి రక్తం కారుతున్నా ఆమెనే చూస్తున్నాడు. పోలీసు ఆమెను జర జరా లాక్కొనిపోయి, రిజర్వుపోలీసుదళంవద్ద వదిలాడు. రాజకుమారి చుట్టూ సైనికుల్లా రిజర్వుపోలీసులు ఆమెచుట్టూ నిలబడ్డారు. అక్కడినుంచి పరుగెత్తుకొనిపోయి, దూరంగా గుంపులు గుంపులుగా వున్న ప్రజలతో చేరిపోవాలని ఆమె ఆశపడింది; వాళ్ళ చేతుల్లో తన్నులు తినాలని కోరుకొంది; వాళ్ళకోపానికి గురికావాలని మనసు పడింది.

కాని చుట్టూ పోలీసులు, వెనుక పోలీసువ్యాను. లెఫ్ట్ రైట్, లెఫ్ట్ రైట్ దిగ్విజయం సాధించినట్లుగా ఆమెను తీసుకొనిపోయారు. "ఎక్కడికి?" ఆమె అడిగింది. "రావమ్మా, మీ యింటికే పంపుతాము." అన్నాడో పోలీసు. ఆమెకు దుఃఖం ముంచుకొచ్చింది. వెనక్కి తిరిగి చూసింది. స్టేషను, స్తంభాలు, గోడలు, మూటల సందుల్లోంచి ఆ బిచ్చగాడు కనిపించాడు. — జ్వరం, కోపం, ఆకలితో కూడుకొన్న అతని చూపులు తననే వెన్నాడుతున్నాయనిపించింది. చూస్తూ చూస్తుండగానే తాను పోతున్న దిక్కులోనే అతడూ వస్తున్నట్లనిపించింది. కళ్ళు నులిమికొని చూసింది. ఎవ్వరూ లేరు. పోలీసుల గబ్బుకంపు. కళ్ళు మూసికోగానే అతడు ప్రత్యక్షమయ్యాడు— అతుకుపచ్చని షర్టు, తొడలు కనపడే పంచె, ఆకలి నిండిన చూపులు, రక్తం......

# ఆల్బమ్

శ్రీ మిరియాల రామకృష్ణ

స్నేహ తీరంలో
వెనుక
కొన్ని జ్ఞాపకాల వజ్రాలు

హృదయ గేహంలో
తెరుపు
ఒక అనురాగ గవాక్షం !

జీవితాకాశంలో
చూడు
ఒక ఆనంద చంద్రరేఖ

కవితారామంలో
నాటు
ఒక చైతన్య బీజం !

దరహాసమాసంలో
పాడు
ఒక సంతోషకాకలి !

# పండితారాధ్య చరిత్ర - పాఠపరిశీలన

## శ్రీ వంతరాం రామకృష్ణారావు

1939 లో ఆంధ్రగ్రంథమాల ప్రచురణగా పాల్కురికి సోమనాథుని పండితారాధ్యచరిత్ర శ్రీ చిలుకూరి నారాయణ రావుగారి పరిష్కరణతో వెలువడినది. ఆ ప్రతిని 1964 లో సవిమర్శముగా పఠించి పాఠపరిశీలన చేసియున్నాను. కాని యింతవరకు ప్రకటించ వలెనను ఉత్సాహము కలుగలేదు. ఈ మహాగ్రంథము 1974లో ఆంధ్రగ్రంథమాలాధిపతుల పుణ్యమా అని పునర్ముద్రణ భాగ్యము నందుట ఈ వ్యాసరచనకు ప్రోత్సాహము నిచ్చినది.

I ఛందోభంగపాఠములు :- ఈ కావ్యమున కొన్నిచోట్ల ఛందోభంగ పాఠములు ప్రధాన పాఠములుగా ముద్రించబడినవి. సలక్షణములైన పాఠము లడుగుపట్టినవి. (1) ఉత్తమాంగ సన్మార్గ పూజా విధానములు. (48పు) యతిభంగము. పూజాభిధానములు- అను పాఠాంతరము సరిగానే ఉన్నది. అభిధానము=నిర్దేశము, అని యర్థము. (2) రీతులు గల విరజాదులం గొని. (63పు) ప్రాసయతి చెడినది. విరజాతుల-అను పాఠాంతరమే గ్రాహ్యము. (3) కన్గట్టి కాన్నను గట్టింప నెట్లు (95 పు) ప్రాసభంగము. కంగటి-అను పాఠాంతరమే ఒప్పు. (4) ఇంతి దదీయ గృహాంగణంబునను. (104పు) యతి భంగము. అంత-అన్నదే సరియైన పాఠము. (5) జడయారి తన చంకం దత్పుత్రు నిచ్చి (190 పు) యతి భంగము. సత్పుత్రు-అను పాఠాంతరమే లెస్స. (6) శ్రుతి యశ్రీ వేతి స్మరేత్కశ్చిదనంగ (194 పు) యతి భంగము. ధృతి-అను పాఠాంతరమే గ్రాహ్యము. (7) అనయంబు భక్తి సుధారసాపార (202పు) యతిభంగము. సుధామృతాసార - అను పాఠాంతరము సరిగానే యున్నది. (8) జంగమ ప్రవరు, వీక్షించు సద్భక్తి వేత్త యెవ్వండు. (207 పు) యతిభంగము, జంగమావళులు (లిని?) వీక్షించు-అను పాఠాంతర పక్షమున యతి సరిపడును. (9) అరుదుగు వ్యక్తినా నలిం ప్రబంధంబు. (261 పు) యతిభంగము. అది- అను పాఠాంతరము సరిపడును. (10) సుఖ తాళ జతిమాన లాభేల వాచె. (245పు) ప్రాస పూర్వాక్షర నియమము చెడినది. లఖలేల- అని పాఠాంతరముల ననుసరించి గ్రహింపనగును. (11) హాలాహలాతి నీలంబును నొక్కెడె. (153పు) యతి భంగము. నీలాభంబునొక్కెడె- అని పాఠాంతరమును బట్టి తెలియ నగును. (12) ద్వైత వాదము లప్రశస్తంబు లుడుగు (154పు) యతి భంగము. ద్వైత వాదముల నస్తవ్యస్తముడుగు-అను పాఠాంతరము గ్రహింప నగును.

(ii) కొన్నిచోట్ల ఛందోభంగ పాఠములే కలవు. పాఠాంతరములు లేవు. లక్షణవంతములైన కవిప్రోక్త పాఠములను నిర్ణయించవలసి యున్నది. (1) తలపోయ బ్రహ్మఘాతుకుండు వెండియును. (12 పు) యతిభంగము. ఘాతకుండు-అన్నదే ప్రకరణోచితమైన సాధు పాఠము. ఘాతకః=హననకర్తా-శబ్దకల్పద్రుమము. (2) ధాతి గురుణా అధిష్ఠితమ్మనియు (76పు) గణభంగము. సమధిష్ఠితమ్మనియు-సాధుపాఠము. (3) జ్ఞానాదులై యని దామెట్లునోడు (121పు) యతిభంగము తానెట్లు-కవిపాఠము. (4) పాపించు మతి పుణ్యలోకంబుల్ లేవు (131పు) యతిభంగము. పుణ్య పాపముల్-అని యుండవలెను. (5) తానాత్మ యది సుప్రసిద్ధం బట్ట కాక. (132పు) గణభంగము. సుప్రసిద్ధ శబ్దమున 'సు' తొలగించిన సరిపోవును (6) నలి నమానామ కళామాత్ర మనంగ (139పు) యతిభంగము. నలి-కాదు. అలి-సాధుపాఠము. (7) వెలుగు నాత్మజ్యోతిని నిరాళినిచ్చి (140పు) యతిభంగము. వెలుగుకు బదులు, నిలుగు-అన నగు నేమో! ఇంకను విచార్యము. (8) అలరు నొకనిచే నిఖిలాండములును (132పు) గణ యతి భంగములు. అలరు నొకనిచేత నఖిలాండములును-అన నగును. (9) లక్షింప హరిహరు నకుం గాని వేహా (148పు) యతిభంగము. హరిహరులకు-అన వచ్చును. (10) అ, నంగ స్మర్యతే నచ దృశ్యతే య, (149పు) గణభంగము. అనంగను-అన్నచో సరిపడును. (11) ముదమున సర్వతోముఖమై వెలుగు. (149పు) గణభంగము. ముఖమయి - అని గ్రహింపవచ్చును. లేదా, వెలుంగ-అన్నను సరియే. (12) వామదేవోత్తర తర వదనంబు (150పు) యతిభంగము. వర వదనంబు- సాధువు. (13) తనర బ్రహ్మోత్పాత దివమాళు (152పు) గణభంగము. దివసమాళు-అన్నచో సరిపోవును. (14) ఇరువదేనవు నది యా నప్రతర్క్య (152పు) యతిభంగము. ఇరువదే నవుది యా నది యప్రతర్క్య - అన నగును. (15) భువినేవమేవ తన్ని బోధిత యనంగ (159పు) గణభంగము. భువి నేవ మేత న్ని బోధత యనంగ-అన నగును. (16) వరుస, తో రుచిర స్వయంజ్యోతి

రుద్దీప్త. (184పు) యతిభంగము. స్వయంద్యోతి–కవిప్రయుక్త పాఠమని నిర్ణయించవచ్చును. "అర్చి శుచి హ్రు సృ పిఛాది ఛదిభ్య ఇసిః" (ఉణాది 265) అను పాణినీయము ననుసరించి ద్యుత్ + ఇసిః=ద్యోతిస్–అని సాధింప నగును. అర్చిస్, శోచిస్–లోనగు శబ్దముల వంటిదే ద్యోతి శ్శబ్దము. "ఉణాదయో బహుళమ్...కేచిదవిహితా అప్యూహ్యాః"–సి. కౌ. (17) మసలక జగదేవమొల్లె బ్రహ్మయలు (203పు) యతిభంగము. మల్ల–సాధుపాఠము. (18) వందితంబై మూఁడు నదులాశ్రయించి. (222పు) యతిభంగము. నందితంబై–సరియైన పాఠము. (19) సందడింపకుఁ డంచుఁ జెక్కిరండంచు (224పు) యతిభంగము. చక్కి–సాధుపాఠము. (20) చరులు, నొప్పారు నుజ్జ్వల సోపానములుగ (241పు) యతిభంగము. చరులు, సొప్పారు–అని గ్రహింపవలెను. (21) సింగన బసవయ్య శరణెప్పిరయ్య (244పు) యతిభంగము. సంగన–సాధుపాఠము. (22) చంక లడిచి కొనుచు శంకరుఁబాడు. (257పు) గణభంగము అడ్చికొనుచు–అని యుండవలెను. లేదా, అడిచికొంచు–అన నగును. (23) అలయ నేక తాళమతె తాళమనఁగ (259పు) గణభంగము. ఏకాతాళము–అననగు నేమో! సంజ్ఞకాన దీర్ఘము నిర్బాధము కావచ్చును. (24) కదిసిన మీఁదటి కొమ్మలుసాఁగె (271పు) యతిభంగము కొమ్మలు–కాదు. కమ్మలు–సాధుపాఠము. తాటికమ్మలనియే వ్యవహారము.(25) సూక్తి, నిల నన్యథాశరణం నాస్తి యనఁగ(273పు)యతిభంగము. నిల–కాదు. నలి–అని గ్రహించిన సరిపోవును. (26) నిటలాక్షునకుఁగాక యెట్లోడి వచ్చె. (275పు) యతిభంగము. ఎటులోడి వచ్చె–అని యుండవలెను. (27) పట్టింప కవి యోగవాగల్లై తనరె (274పు) ప్రాస భంగము. పట్టింపక–తప్పు. పంటింపక–సాధుపాఠము. (28) దరహంబును ననుతాయియు నోజె (261పు) గణభంగము. దరహంబునును–అని గ్రహించ నగును. మఱికొన్ని జారుపాటులు కలవు. అవి ముద్రణ లోపములు కావచ్చును.

II కొన్నిచోట్ల పాఠాంతరాదులను బట్టి సాధుపాఠముల నూహించు ప్రయత్నము తృప్తికరముగా జరుగలేదు. (1) ద్రాప ఛందోవిరుద్ధంబాదియగు న,లాప (5పు)అని ముద్రితము. లాబ–అని పాఠాంతరము. కావ్యదోషములలో ద్రాబ–అనునది కలదు. కాన, ద్రాబ, అలాభ–సాధుపాఠములని నిర్ణయించ వచ్చును. (2) కేశవ పుటశాస్త్రి కేమన పెన్ని (30) ఇట, ఘడ (డె) శాసి(చి)–పాఠాంతరము. కనుక ఘటశాసి–సాధుపాఠము. (బసవ 186పు;)[ఆముక్త 6–89) అరయుంగ గత భవిష్య ద్వర్తమాన, కాలంబులందు (222పు.) ఇట, భూత–అను వ్రాతప్రతి పాఠమును నిల్పినచో వర్తమాన శబ్దము పట్టదని, గత–అను పాఠముమ కల్పించినట్లు పరిష్కర్తలు తెలిపినారు. విరచింప భూత భవిష్య దేతత్రి, భువి భవిష్య ద్వర్తమాన–పాఠాంతరములు. సంస్కృతానువాదములో "భూత భావి వర్తమానేషుచ త్రిషుకాలేషు" అని ఉన్నట్లు వారే చెప్పినారు. కనుక,"విరచింప భూత భవిష్యద్భవత్త్రి, కాలంబులందు" కవి పాఠమని నిర్ణయించ వచ్చును. "భవత్=వర్తమానార్థమ్–ఇతి మేదినీ" (శబ్దకల్పద్రుమము) (4) ఇన శశి గ్రహములు హితమైన నాళ్ళ (235పు)–నాడ్లు–అను పాఠాంతరమును బట్టి నాండ్లు–కవిపాఠమనవలెను. నాళ్ళు–అర్వాచీన రూపము.

III కొన్నిచోట్ల ఛందోభంగ భ్రాంతిచే ఉపలబ్ధములయిన సలక్షణపాఠములు సవరించ బడినవి. ప్రాచీనకాలమున అక్షరజాతులలో మగణ నగురువు లింద్రగణములు గాను, గగ నగణములు సూర్యగణములుగాను వాడబడుచుండెను. (భారతి–1969 మే.) ఈ విషయము గుర్తింపక కవిప్రయుక్త పాఠములను కొన్నిచోట్ల దిద్దివేసిరి. (123, 139, 149, 150, 156, 244 పుటలు.) చూచుకొనక కాబోలు కొన్నిచోట్ల దిద్దలేదు. (53, 122, 155, 232, 246, పుటలు.) ఒకచోట "తేర్చి పలుక వలెను" అని అని వ్రాసిరి. (18పు,) ఉపలబ్ధపాఠములే పరిగ్రాహ్యములు.

**IV** అనుకృత సంస్కృతవాక్యములలో అపపాఠములు :- **(1)** తుః యుత్సరాత్సరలో ఈశ యనఁగ (151పు) ఈశ-అప పాఠము. ఈ వాక్యము, శివ-అను సాధుపాఠముతో స్థలాంతరమున ముద్రింపబడినది. (157పు) **(2)** ఇదిగాక తేషాం మహేశ్వరో యనఁగ (151పు.) "తయోర్మైషయ్-అని సంస్కృతానువాదము. తేషాం అనడము గణముల కోసము" అన్నారు. ఈధోరణి అసంగతము. "ఇదిగాకయుఁ దయోర్మహేశ్వరో యనఁగ" అన వచ్చుచు. **(3)** మెఱయ స ఈక్షతే మేను లోకాంశ్చ-అను వ్రాతప్రతుల పాఠమును, "మెఱయు స ఈక్షతేమాన్ను లోకాంశ్చ" అని దిద్దుటలో యతిభంగమును తెచ్చిపెట్టినారు. (123పు) "పూని స ఈక్షతే మేను లోకాంశ్చ" అని అని సోమనాథుడు స్థలాంతరమునందును వాడినాడు. (161పు) మాన్ను-అన్నచో ఇట ప్రాసయతి చెడును.

**Vi** లేఖక దోషములను ప్రక్షిప్తము చేయుట :-కమనియ్యు, అయ్యున్న-వంటి రూపములను పెక్కుచోట్ల ప్రక్షిప్తము చేసినారు. కమనీయ, ఐయున్న-అను రీతి నెల్లచోట్ల గ్రహింప వలెను. చాయన (=చయ్యన) ఆయ (=అయ్యె) అను రూపములు కలవని యీ సందర్భమున గుర్తించుట ఆవశ్యకము.

**V** కొన్నిచోట్ల పరిగ్రాహ్యములైన పాఠముల నడుగున పడవేసినారు. భక్త లతి యాజ్ఞ (3 పు) ఇట, భక్తవరులాజ్ఞ-అను పాఠాంతరమే కవి సమ్మతము. భావన (5పు) కాదు. భావాన-లెస్స. దుర్గ (15పు) కాదు. దుర్గి-అన్నదే కవిపాఠము. ఇది వైదిక పదము. "తన్నో దుర్గి ప్రచోదయేత్" పురుష సూక్తము. "స, త్కరుణాన్విత దుర్గి వరము గాటయ కొనఁగున్" (గణపతిదేవుని నాటి శాసనము) బావని (36పు) కాదు. బ్రాహ్మని-కవి పాఠము. క్రేగంట (45పు) కాదు. క్రేకంట-అన్నదే కవి సమ్మతము. కకారము బసవ పురాణమున ప్రాస గతముగ ప్రయుక్తము. (74పు) తొట్రుఁ బొక్కులు (52పు)సరికాదు. తొక్కుఁబొక్కులు-అన్నదే పరిగ్రాహ్యము. "గంగాంబ, గట్టిన హొంబట్టు పుట్టంబు వేడ" (53పు) అని గ్రహించినారు. ఇట, పటవలి పుట్టంబు-అన్నదే ఒప్పు. "గంగాంబ గట్టిన పటవలి పుట్టంబు"-అని బసవ పురాణము. (49పు.) కల్లినాథుని కూర్చు కట్టనుంగనక (60పు) ఇట, కట్టెనుఁగనఁగ-అను పాఠాంతరమే గ్రాహ్యము. "కల్లినాథుని భద్ర గజము" (బసవ 90 పు) అని బసవ పురాణము. చేవంతి (63పు) కాదు. సేవంతి-అన్నదే సరియగు రూపము. లేదా, కాముకుఁడు, చేమంతి – అను పాఠాంతరములను గ్రహించ వచ్చును. నిలుతిత్తియొలిచి (98పు) కాదు. నిలువు తిత్తొలిచి-అన్నదే సరి. విరించ్యాది (126, 218పు) అనుచో విరించాది – అను పాఠాంతరమే కవి సమ్మతము. విరించ-శబ్దమును గలదు. మధ్య (136పు) కాదు. నడ్మ-అను రూపమే కవిప్రయుక్తము కానోపును. భేతాళ (160పు) తప్పు. వేతాళ – అన్నదే సాధువు. కంబంబు (164పు) కాదు. కంభములు-అను పాఠాంతరమే కవి సమ్మతము. చూపురా (195పు) తప్పు. చూపరా-ఒప్పు. ఎంగిండ్లు (202పు) తప్పు. ఎంగిళ్లు-ఒప్పు. హరిముఖ్య సురలకు (214పు) తప్పు. సురులకు-ఒప్పు. మెప్పించి (217పు) తప్పు. ఇట్లే మరికొన్నిచోట్ల ముద్రించిరి. ఇది అర్వాచీన రూపము. మెచ్చించి-అన్నపాఠాంతరమే ఒప్పు. మెచ్చించు-అన్నదే ప్రాసాదిగతముగ ప్రయుక్తము. (బసవ 77పు) వర్తింపుచు (219పు) తప్పు. వర్తించుచు అనుపాఠాంతరమే ఒప్పు. ఇట్టి పత్యరూపములు పెక్కుచోట్ల ముద్రింపబడెను. పత్వాదేశ రూపములు ప్రాచీన సమ్మతములు కావు. చూచుచు సంతసించుచు మహోత్సవము" (239పు) అని చత్వరూపమే యతిస్థాన గతముగ కలదు. పుణ్యోషధులును (220పు) తప్పు. పుణ్యౌషధులును – ఒప్పు. మంజిళ్లు (228పు) కాదు. మాంజిష్ఠ-సరియైనది. మాంజిష్ఠ లెర-హర 7–137 మూర్ధ్ని (260పు) కాదు. మూర్ధ్ని=అన్నదే ఒప్పు. పాము శవము (264పు) కాదు. పాంపసబము-అన్నదే కవిప్రయుక్తము. (హర 7–55) అణిమా మహిమాదిష్ఠ (276పు) సరికాదు. అణిమాదిక మగు నష్ట-అన్నదే గ్రాహ్యము. నారేశ్వరంబు (278పు) కాదు. కాశీశ్వరంబు-అను పాఠాంతరమే లెస్స.

**VI** మరికొన్ని సవరించ వలసిన అపపాఠములు : అయ్యోడమ (88పు) తప్పు. అయ్యోడుము-ఒప్పు. అధమపాళులు (33పు) తప్పు. అఱవపాఱులు-ఒప్పు. అక్కడకు (69పు) తప్పు. అక్కడికి-ఒప్పు. అక్కడికి-ఒప్పు. అక్కడ-శౌపవిభక్తికమే. తెరియని యట్టి విధి నిషేధమ్ము లెక్కడివి తలపోయన్" కళా4-188) పెండ్లిండ్లు (80పు) తప్పు. పెండిండ్లు-ఒప్పు. బెళసు (104పు) కాదు. ఇది సబిందుకమే. బెళఁగు-ఒప్పు. కోరబెళంగనో-బసవ 61పు. చిన్నవోయిన (170పు) తప్పు. చిన్నఁబోయిన-ఒప్పు. పూజకుండలు (189పు) కాదు. ప్రాజెకుండలు-గ్రాహ్యము. ధర్మకవిలె (200పు) కాదు. దర్మకవిలె-గ్రాహ్యము. ఢాకిని (227పు) తప్పు. డాకిని-ఒప్పు. గనుప (229పు) తప్పు. గనప-ఒప్పు. కనప-పాఠాంతరముగ కలదు. గకారమునకు, కకారము వ్రాయుట లేఖనసంప్రదాయము. ఇది తెలియక పరిష్కర్తలు, పరిశోధకులు, త్రొక్కిన అపమార్గములు కలవు. (ఆంధ్రపత్రిక-ప్రమాది సంవత్సరాది సంచిక.)

పదకోశములు, నిఘంటువులు, లక్షణగ్రంథములు సుష్ఠుగా తయారు కావలెనన్న ముందు ముద్రణములు సుపరిష్కృతములు కావలెను. 13వ, శతాబ్దపు గ్రాంథిక భాషాస్వరూపమును తెలిసికొనుటకు, తిక్కనభారతము లోపాటుగ, పరిశోధకులకు మిక్కిలి ఉపకరించు సోమనాథుని గ్రంథములను చక్కగా పరిష్కరించవలసిన అవశ్యకత కలదు. విస్తరభీతిచే కొన్ని ముఖ్యములయిన పాఠములనుగూర్చి మాత్రమే యిందు వ్రాసినాను. సోమనాథుని భాషావిశేషములను గూర్చి అవకాశమును బట్టి మరియొకసారి వ్రాయుదును.

# రైతు యోధులకు జేజేలు

"జయ" — అంటే ప్రజల మనోరథం మీద ఎత్తిన జయ పతాక
"సోనా" — అంటే దీక్షా స్వర్ణ కంకణ ధారణ
"రత్న" — అంటే రత్నాల రాసుల వంటి కళ్లంలో పంట కుప్పలు
"జగన్నాథ్"— అంటే ప్రగతి వైపు పరువెత్తే జగన్నాథ రథచక్రాలు

ఇవన్నీ వేటికి పేర్లు? ఇవి మన రాష్ట్రంలో పండిస్తున్న మేలు రకం వంగడాలు.

పొలాలలో హలాలతో ప్రకృతి మీద యుద్ధం చేస్తున్న రైతు వీరులకు జేజేలు.

గడచిన ఏడాది రాష్ట్రంలో
వరి ధాన్యం ఉత్పత్తి
53.52 లక్షల టన్నులు.

1974–75 లో
14 లక్షల ఎకరాలకు పైగా
వరిపైరు వేశారు.

---

సమాచార, పౌర సంబంధ శాఖ, హైదరాబాదు.

నెం. 6/75–76

# శ్రీనివాసు నక్షర చిత్రము

శ్రీ శంకరంబాడి సుందరాచారి

క్షేత్రరాజమగుచు చెన్నారు తిరుపతి
పురములోన శేషగిరి తటాక
కాపురమ్ము సేయు కాలశక్తి ! నాదు
చిత్త మందికొనుము శ్రీనివాస !

స్వర్ణకవచయుక్త సర్వాంగ సుందరా
కార నిన్ను బొగడ నేరితరము !
పలుకు పెగిలిరాదు భావాలు దొరలవు,
చేత కామి తోచె శ్రీనివాస !

మకర తోరణమ్ము మధ్య గంభీరమై
నిలిచియున్న నీదు నిండుమూర్తి,
పూర్వ పుణ్య ఫలమువోలెను బక్యమై !
చేతి కందనుండె శ్రీనివాస !

పునుగుపూతమీద కనుగప్పి యెగబ్రాకి
ఫాల మెల్ల నిండి పరిమళమ్ము
కలయజిమ్ము పచ్చకపురంపు నామమ్ము
చెంత కీడ్చు నన్ను శ్రీనివాస !

చుబుకమందు చాల సొంపుగా దిద్దిన
చుక్క యొకటి దిష్టిచుక్క యనగ
అందచందములకు నందాలు దిద్దుచు
చెన్నుమీఱునయ్య శ్రీనివాస !

కనక మకుట కాంతి, కర్ణకుండల దీప్తి,
శంఖ చక్ర మహిమ, సర్వభూష,
మకర కంఠె, దివ్య మణిహార సుమహార
శ్రీల నెలిగె దీవు శ్రీనివాస !

ప్రాకి కటిని నంటి నర్తించు హస్తము,
పాదతలముఁ జూపు వరకరమ్ము.
వక్షమందు లక్ష్మి వసియింప నిను జూచు
జీవి ధన్యజీవి శ్రీనివాస !

కోటిదేవు లున్నచోటు భారతభూమి;
కనినచోట్లనెల్ల కలవు గుడులు;
కాని నీకు సాటి కలుగ రీ భువిలోన
స్వానుభవము సాక్షి శ్రీనివాస !

# “బాలవ్యాకరణము - త్రిలింగలక్షణశేషము”

## శ్రీ నాగళ్ల గురుప్రసాదరావు

## 1

“బాలవ్యాకరణము త్రిలింగలక్షణశేషము” అను వ్యాసమును నేను వ్రాయుటయు, దానిని శ్రీ పాతకోట రాధాకృష్ణమూర్తి యను వారు విమర్శించుటయు, నేను సమాధానమిచ్చుటయు, మరల వారు వ్రాయుటయు “భారతి” పాఠకులెల్ల రెఱిఁగినట్టివే. నవంబరు “భారతి”లో శ్రీ మద్దిపట్ల సుబ్రహ్మణ్యశర్మ యనువారు వాదోప వాదములనెల్లఁ జక్కఁగాఁ జదివి, తమ యభిప్రాయములను వెల్లడించుచు, నా చూపిన సాక్ష్యములకుఁ దమకుఁ దోఁచిన యొక రెండు సవరణలను సూచించిరి. ముందు శర్మగారికి సమాధానము చెప్పుట నా విధి.

నా వ్యాసోద్దేశము “ఆచార్యులవారి దోషములు నిరూపించుట” యనియు, నా “యాశయము ఆచార్యులవారిని దుయ్యబట్టుటయే” యనియు శర్మగారి యూహ. పురస్సిద్ధాంతములతో నేను వ్యాసము వ్రాయలేదు. ఆచార్యులవారిపట్ల నాకెట్టి యసూయయు, ద్వేషమును లేవు. ఈ విషయమును సెప్టెంబరు “భారతి”లో సందేహమునకుఁ దావులేకుండ స్పష్టముగా వ్రాసితిని. శర్మగారు దానిని జూచియు నుపేక్షించుట దురదృష్టము. ఒకవైపు “విషయమును విశదపరచుటయే” నా లక్ష్యమని గ్రహించినవారే, “అనేక కర్తృక క్రియకు సమీప కర్తయొక్క లింగవచనంబులగు”నను సూత్రము “నిత్యవిధి గాదనియు, దానిలో మార్పులు వలయుననియుఁ దోఁచుచున్న”దని నేను సూచించినందులకు నా యంతరంగమును శంకించిరి. కావుననే వారి వ్రాఁతలలోఁ జిత్తశుద్ధి చూపట్టుచున్నది. నా వ్యాసమును శ్రద్ధాతాత్పర్యములతోఁ జదివిన శర్మగారికిఁ గృతజ్ఞుఁడను. వారి సందేహములను బరిహరింపఁ బ్రయత్నింతును.

“చిన్నయసూరికిఁ దెలియని లక్షణములను నేను చెప్పుచుంటి నని త్రిలింగలక్షణశేషము నాచార్యులవా రెచ్చటను జెప్పలేదు. సూరి బాలవ్యాకరణమునఁ జెప్పక విడిచిన లక్షణములను వారు చెప్పిరి. త్రిలింగలక్షణశేషము అను పేరిడుటలోఁ గల యౌచిత్యము నిదియే గదా! ఆచార్యులవారు చెప్పిన లక్షణములు సూరిగారికిఁ దెలియవని యనిన వారెవ్వరు? అట్లెవ్వరైన నూహింతురా?”యని శర్మగారు వ్రాసిరి. సూరికిఁ దెలియని లక్షణములను దాను జెప్పుచున్నట్లాచార్యులవారు టముకు వేసికొనిరని నేను నా వ్యాసములలో నెక్కడ వ్రాయలేదు. త్రిలింగలక్షణశేషము బాలవ్యాకరణమున కనుబంధమని నాకును దెలియును. త్రిలింగలక్షణశేషతత్త్వము నా కవగాహన మయినట్లు నా వ్యాసములు చదివిన శర్మగారికిఁ దెలిసియేయుండును. ఎవరో యెక్కడనో యాచార్యులవారు చెప్పిన లక్షణములు సూరికిఁ దెలియవని యన్నారని నేను వ్యాసము వ్రాయలేదు. నా వ్యాసలక్ష్యమును, నా నిర్ణయములకు హేతువులను సాకల్యముగా ఏప్రియల్ “భారతి”యందే స్ఫుటికస్పష్టముగాఁ జాటితిని. వానిని మఱొక్కసారి శర్మగారు చదువవలయునని నా కోర్కి. చదువుదురుగాక!

సూరి సేకరించిన లక్ష్యములు పెక్కులు. వాని లక్షణములు సూత్రాంధ్రవ్యాకరణరూపము ధరించినవి. కాని యా సంస్కృత వ్యాకరణము బాలురకు సుసాధముగాలేదు. కాన యాయన యా వ్యాకరణమున సూత్రములు కొన్ని తెలిఁగించి బాలవ్యాకరణమును రచించెను. దానితరువాతఁ ద్రిలింగలక్షణశేషము వెలుఁగుచూచెను. అందలి లక్షణములు కొన్ని సూరి యెఱుఁగునని నాకంటె ముందే కొందఱు కోవిదులు నిరూపించిరి. నేను మఱికొన్నిలక్షణము లాయన యెఱుఁగునని నిరూపించితిని. నా నిరూపణమున కుపోద్బలకముగా సూరి నిర్మించిన నిఘంటువునుండి, వ్రాసిన వ్యాకరణమునుండి సాక్ష్యములు సేకరించి వెల్లడించితిని. దీన దోష మేమున్నదో నా కర్థము కావుటలేదు.

దోషము గాదని శర్మగారికిఁ దెలియును. తెలిసియు నాపైని నేరమివెట్టిరి. నేను నా వ్యాసాంతమున నాచార్యులవారి సూత్రములో మార్పులు వలయునని వ్రాయఁగా వారికి సందేహములు జనించినవి. ఆచార్యులవారిని దుయ్యఁబట్టితినని వా రనుకొనిరి. శర్మగా రంత

దూరము పోనక్కఱలేదు వ్యంగ్యార్థములు ప్రత్యేగాదు. నా వ్యాసము పేరు ''బాలవ్యాకరణము–త్రిలింగలక్షణశేషము'' గదా! కావుననే వ్యాసాంతమున త్రిలింగలక్షణశేష సూత్రమును దడవి, యొక మహాకవి ప్రయోగమును జూపి, దానికి సవరణ యుచిత మని యంటిని. నే నాచార్యులవారిని నర్మగర్భముగాఁ దక్కువపఱచితినని శర్మగారిక ముందు భావింపరని యూహింతును.

ఇఁక వారికిఁ దోచిన సవరణఁమాట యెత్తుకొందును. సూరి వ్యాకరణ రచనా వ్యాసంగమున బాల వ్యాకరణము చరమసృష్టి యగుట సత్యము. దానిలో నాయన తద్భవములం దలఘురేఫము లేదనెను. నిఘంటురచనాకాలమున సూరియే తద్భవములలోఁ గొన్నిట నలఘు రేఫము వెలయుచున్న దనెను. ఆయన నిఘంటు వెప్పుడు రచించెను? అందును దద్భవములలో నలఘురేఫము కనఁబడుచున్నదని చెప్పిన భాగము నెప్పుడు వ్రాసెను? నిఘంటువునకు సమకాలికముగా బాల వ్యాకరణ రచనము సాగెనా? ఈ రెండింటిలో నేది ముందు? ఏది వెనుక? మన కీనాఁ డీవిషయము లూహలుగా మిగిలినవి.

''బాలవ్యాకరణమున సూరిగారు దాని నేల కాదనిరి? మరల నిఘంటుకాలమునాఁటికి తమ యభిప్రాయము నేల మార్చుకొనిరి? ఇది యైకమత్యము నొప్పని విషయముగా నున్నదే! ఈ విషయమును ప్రసాదరావుగా రాలోచింపరైరి.'' అని శర్మగారు ప్రశ్నించుచు నాశ్చర్యపడిరి. వా రడుగఁదగిన ప్రశ్నములే యడిగిరి. న్యాయ్యముగా వారి ప్రశ్నములకు బదులు చెప్పవలసినవారు, చెప్పఁగలవారు సూరిగారే. తద్భవములలో నలఘురేఫము కలదని సూరి గుర్తించె నన్నంతవఱకే నాకుఁ గావలయును. నా ప్రథమ వ్యాసమున కామాత్రము చాలును. సూరిగారి యభిప్రాయముల యనైక్యమునకుఁ గారణ మేమి? యను ప్రశ్నము మాట నేను దలఁపలేదని శర్మగా రూహించిరి. వారు పొరపడిరి. నా వ్యాసముమీఁద వచ్చిన విమర్శకు సమాధానము వ్రాయుచు సెప్టెంబరు ''భారతి'' లో ''......కాన తద్భవములలో శకటరేఫ ముండనే యుండదని కొందఱు సెలవిచ్చుట సూరిహృదయమునకే విరుద్ధము. తద్భవములలో శకటరేఫ మరుదు గావునఁ దద్భవములలో శకటరేఫము లేదను లాక్షణిక మతము నిట (బాల వ్యాకరణములో) సూరి సూచించెనని గ్రహింపనగు'' నను వంతరాం రామకృష్ణారావు గారి మాటల నుద్ధరించితినే! శర్మగారు వానిని జూచియు నుపేక్షించిరి కాఁబోలు! రామకృష్ణారావుగారిమాటలు సమంజసములని నేను దలంచితిని. వానికంటె సమంజసములైన యుపపత్తులను శర్మగారుగాని, మఱి యెవ్వరైనఁగాని యుద్ఘాటించి, సూరిగారి తప్పులు సహేతుకముగాఁ జూపినఁ దప్పక నే నొప్పుకొందును. శర్మగారు నా వాక్యములకు స్వవచన వ్యాఘాత దోష మంటుకొన్నదని యనుకొన నక్కఱలేదు.

''సబిందుక నిర్బిందుక భేదమును గుర్తించుటచేతనే ఆచార్యుల వారు (సబిందుక) పేట శబ్దము వైకృతమని పేర్కొనుట జరిగినది. సూరిగారి వాక్యమును ఆచార్యులవారు సవరించిరని యూహించుట ప్రమాదికము'' అని శర్మగా రాచార్యులవారిని సమర్థించుచు వ్రాయుట ప్రమాదము, బాల వ్యాకరణ త్రిలింగ లక్షణ శేషముల మూల తత్త్వమునకే విరుద్ధము, ఆంధ్ర వ్యాకరణ వేత్తల మతమునకే వ్యతిరేకము.

సూరిగారు ''త్రిలింగదేశ వ్యవహార సిద్ధంబగు భాష దేశ్యంబు'' అని సూత్రించి లక్ష్యములలోఁ గోటపేటలను జూపెను. బాలవ్యాకరణ లక్ష్య లక్షణములనుగూడ సవరింప నెంచిన [సూరి బాల వ్యాకరణమునఁ జెప్పక విడిచిన లక్షణములను ప్రతిపాదించుట మాత్రమే శర్మగా రనుకొనుచున్న ట్లాచార్యులవారి లక్ష్యము గాదు. అది యేకదేశము.] యాచార్యులవారు సూరి దేశ్యములుగా నుదాహరించిన కోటపేటలను వైకృతము లనెను. సూరిగారి పేట నిర్బిందుకమా. ఆచార్యులవారి పేట సబిందుకము. సూరిగారు సూత్రముపట్టిన కోట పేటలు చక్కఁదిద్దుటకుఁ బూనుకొన్న యాచార్యులవారు సూరి యుదాహరింపని సబిందుకమగు పేట మాట దలపెట్టనేల? పేట శబ్దము వైకృతమని నిరూపించుట యాచార్యులవారి యభిప్రాయ మని శర్మగా రూహించు చున్నారు. వారు ప్రకరణము మఱచిరి. శర్మగారి యూహ నిజమైన సూరి దేశ్యములన్న కోట పేటల నాచార్యులవారు జోడించెడివారే కారు. పేటకుఁ బ్రత్యేకముగా సూత్రము రచించెడివారే. ''కారము క్షారశబ్దభవ'' మిత్యాదిగా నాచార్యులవారేకైక లక్ష్యమునకు లక్షణము చెప్పిన పట్టు లున్నవిగదా! ఈ సందర్భమున ''సుప్తార్థ ప్రకాశిక'' పోయినపోకడ వింతలలో వింతగా నున్నది. అందు సూత్రముక్రింద నిర్బిందుక మగు పేట శబ్దమే కలదు. కాని వ్యాఖ్యానమున సబిందుక మగు పేట యున్నది. అది యునుగాక వేంకటరామశాస్త్రిగారు ''మూలమునందుఁ గోటపేట శబ్దంబులు దేశ్యములుగా నుదాహరింపఁబడ్డవి కాని యట్లుగా'' దని వ్రాసిరి. వారన్నట్టు మూలమున సబిందుకమగు పేట శబ్దము లేదు గదా?

ఇప్పట్టున నాంధ్రవ్యాకరణవేత్త లేమనిరో శర్మగారు పరిశీలింపవలయును. వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రిగారు

''పల్లె అను నర్థముగల సార్ధబిందుక పేటశబ్దమును సూరి యుదాహరింపలేదు. బాలవ్యాకరణ ముద్రణములలో నెందును సార్ధబిందు పేట శబ్దము పడియుండలేదు. ''పేట దే. వి. హారములో

సాకసరము" (శ.ర.) అను నిర్ణిందుకపేట శబ్దమె సూరికి నుదాహృతమయ్యె ననుటలో సందియము లేదు......ఈ ప్రౌఢ వ్యాకరణపు వివరణము సరికాదు. సూత్రీకరించునపుడు పేటశబ్దము నుదాహరింపనేలేదు. బాలవ్యాకరణమును సవరించుటయే ప్రయోజనముగాఁగల ప్రౌఢ వ్యాకరణ సూత్రము వృథా సమర్థించుట సరికాదు. ఆ పక్షమున నీ సూత్రము కేవలము నసంగతముగనే యుండునుగదా."

అని వ్రాసిరి. ఇంటటి పూర్వార్ధ వాక్యములను ఏప్రియల్ "భారతి"లో నా వ్యాసము చెప్పెను. వానిని శర్మగారు చూచి యుండరు. ఇక పంటరాం రామకృష్ణారావుగారు ""కోటపేటలు వైకృతము"లను నాచార్యులవారి సూత్రమునకు వ్యాఖ్య వ్రాయుచు

"కోట శబ్దము తద్భవ మనెదరను. సూరిగారు తమ నిఘంటువులో కోట శబ్దమును కోట్టశబ్దభవముగనే చూపియున్నారు. బాలవ్యాకరణమున నిర్ణిందుక మగు పేట శబ్దము దేశ్యముగఁ జూపఁబడినది. ఈ విషయమును గమనింపక సబిందుకమగు పేంట శబ్దమును పీఠశబ్ద భవమని యిటఁ బ్రతిపాదించుట యప్రసక్తము. కాన త్యాజ్యము" అని విమర్శించిరి. ఇప్పుడు శర్మగా రేమందురు?

ఈ పేట-పేంట శబ్దముల విషయమున మన నిఘంటువుల విధానము విచిత్రము. శబ్దరత్నాకరము నిర్ణిందుకమగు పేట శబ్దమునకు హారములో నొక సరమని యర్థము చెప్పఁగా, సూర్యారాయాంధ్ర నిఘంటువు సబిందుక మగు పేంట శబ్దమునకే యా యర్థము నిర్ణయించెను. ఆ పక్షమునన్నైన నీ శబ్దము దేశ్యమె యగును. వైకృతము గాదు.

## 2

శ్రీ పాతకోట రాధాకృష్ణమూర్తి రెండుసారులు నా వ్యాసములమీఁద విమర్శలు వ్రాసిరి. విమర్శలు వెలువడవలయును. చర్చలు సాగవలయును. అప్పుడుగాని తప్పొప్పులు తెలియవు. సత్యము స్పష్టము గాదు. పాతకోటవారి తలంపులో వ్రాఁతలు వ్రాసిన తెన్నుగా నుండెడివి. కాని వా రావని చేయుదు, చేయలేరు. రాధాకృష్ణమూర్తిగారు ముఖ్యవిషయములను మూలకు నెట్టుదురు. పొలు పొందు లేనివానిని ముందునకుఁ దెత్తురు. ప్రకరణోచితము లయిన పలుకులు పలుకక, యసంగతము లయిన ప్రసంగములు గావింతురు. అనుకూలం మనుకొన్న చోట ననత్యము లాడుదురు, చెప్పఁదగినమాట చెప్పక చప్పన జారు

విడిచి తప్పుకొందురు. శాస్త్ర సమన్వయమున వారికి రక్తియే కాదు, శక్తియులేదు. వారు తాము చేయునిర్ణయములకు నిఘంటువునుగాని, కవిప్రయోగమునుగాని తార్కాణింపరు. ఇతరులకుఁ గవిప్రయోగములు కావలయును, చూపుఁడని హెచ్చరిక చేయుదురు. కవిప్రయోగములు చూపినఁ గాలహరణమని గోలచేయుదురు. వారిది వస్తునిష్ఠమయిన విమర్శ గాదు. మఱి వ్యక్తి విమర్శ. నవంబరు "భారతి"లో వారు వ్రాసిన వ్యాస మంతయు నేను జెప్పిన పయిమాటలకుఁ బ్రథమోదాహరణము.

రాధాకృష్ణ మూర్తిగారి వాదమునఁ బసలేదు. పస లేనియపుడు కసిపుట్టును. నవంబరు "భారతి"లో వారు వ్రాసిన వ్యాసమెల్ల నాక్రోశరాశి. దాని మూలద్రవ్యము కసి. తప్పుల కుప్పలగు మాటలు చెప్పిరి. కొన్నియుదాహరణములు చూపుదును.

రాధాకృష్ణమూర్తిగారు "పూర్వము పశుపక్ష్యాదులు గూడ ధారాళముగా మాట్లాడెడివని గ్రంథములవలనఁ దెలియుచున్నది. ఇంతెందుకు-పింగళి సూరన కళాపూర్ణోదయములో శుచిముఖి యను శుకమునుగూర్చి చదివియే యుందురు నాగళ్లవారు! అవియు చిలుకపలుకులేగదా!" యని వ్రాసిరి.

"బొంకరా బొంకరా పోలిగా అంటే టంగుటూరి మిరియాలు తాటికాయలంత అని అన్నాడట" యను లోకోక్తికి నుదాహరణముగా నున్నది వీరి వితండావాదము. కళాపూర్ణోదయమఁట! శుచిముఖియఁట! అది చిలుకయఁట! ఏమి వీరి పూర్వకావ్యపఠనము! ఏమి వీరి పాత్ర పరిజ్ఞానము! శుచిముఖియను శుక మున్న కళాపూర్ణోదయ తాళపత్ర ప్రతిని గ్రొత్తగాఁ ద్రవ్వి తలకెత్తుకొన్నారా పాతకోటవారు! దానిని జూపి వారు తెలుఁగువారి యుల్లములు కొల్లగొందురుగాక!

కళాపూర్ణోదయములో శుచిముఖినిగూర్చి నేను జదువుకొనలేదు. నా చదు వట్టిదియుఁ గాదు. పింగళి సూరన రచించిన ప్రభావతీ ప్రద్యుమ్నములో శుచిముఖి యున్నదని వితండావాదము చేయని పండితుని కెవ్వనికైనఁ దెలియును. అది చిలుక గాదు. మఱి రాజహంసి. ప్రాచీనకావ్య పఠన పాఠన ప్రవీణు లగు పాతకోటవారు పరికించిరో, పరికింపలేదో కాని ప్రభావతీ ప్రద్యుమ్నమున నొక ఘట్టమున శుచిముఖి దేవేంద్రునితో నిట్లనెను.

"విను, సురేంద్ర! పద్మజుని తేరు దిపుచు సా
రంధరాఖ్యుఁ డగు మరాళవిభుని
బిడ్డ నేను; వాణి పెనువంగఁ బెరిగి, త
ద్విమల శిక్షఁ గంటి విద్యలెల్ల" (ఆశ్వా 2. పద్య 6)

పాతకోటవారిది వాదబలముగాదు. మఱి వాదిబలము. అది నుండియు వారు వాదమును వక్రమార్గము పట్టించిరి. చర్చ సక్రమముగాఁ జాగింపలేక, గతి గానక తుదకు శాబ్దిక చర్చకు దిగిరి. అది వారికి వ్యాకరణ పాండిత్యమేకాక శబ్ద పరిజ్ఞానము సైత మంతంత మాత్రమే యని రుజువుచేయుచున్నది.

"రుజువు చేయవలయును" "రుజువుచేయు చున్నవి" యని నా వ్యాసములో వ్రాసితిని. రుజువు శబ్ద మపశబ్దమని యనుకొని రాధాకృష్ణమూర్తిగారు, సంతోషము పట్టలేక "ఇం దచ్చులో ఋజువు అని పడుటకు మారుగా రుజువు అని పడినది. అది ముద్రా రాక్షసమా? లేక వారి చేతి వ్రాతయా?" యని వావదూకత చూపిరి.

అది ముద్రారాక్షసము గాదు. నా చేతి వ్రాతయే. ఆ శబ్దము సుశబ్దము గాదనుకొనుట పాతకోటవారి నొసటివ్రాత మాత్రమే. వారు శబ్దరత్నాకరమును క్షోదక్షమముగాఁ బరిశీలించినవారు గదా! దానిని ప్రమాణీకరింతురుగదా! దానిలో నేమున్నది?

శబ్దరత్నాకరములో "రుజువు" అని కలదు. అది విశేష్యము. హిందూస్థానీ భాషాపదము. సాక్ష్యము, దృష్టాంతమని దాని యర్థములు. ఇవి నా మాటలు గావు సుమా! సీతారామాచార్యులవారు చెప్పినట్టివే. రుజువుచేయు–అనఁగా సాక్ష్యముచూపు, దృష్టాంతము చూపు అని యర్థములు. రుజువుచేయు–అని యన్నపుడు ఋజువు చేయు అని యుండవలయునా? పాతకోటవా రెంత బుట్ట యల్లిరి! శబ్దరత్నాకరము "ఋజువు"అను శబ్దము సంస్కృత సమ మనియు, విశేషణ మనియు, ప్రగుణము–చక్కనైనది యని యర్థము లనియుఁ బలుకుచున్నదే! అట్టిచో రుజువుచేయు – అనుచోట ఋజు శబ్ద ముండుట యెట్లు పొసఁగును?

నే నుపయోగించిన సుశబ్దము నపశబ్దమని రట్టుచేసిన రాధాకృష్ణమూర్తిగారు తమ యపశబ్దములను గూర్చి యేల యాలోచింపరు. వారు వాడిన "మాట్లాడు" సుశబ్దమా? "ప్రయోగించారు" సాధువా? "నిజానిజము" నిర్దోషమా? "తప్పు లెన్నువారు తమ తప్పు లెఱుఁగ" రను సూక్తిని రాధాకృష్ణమూర్తిగారి వంటి సంఖ్యావన్మణులు మఱువరాదు.

"అది ముద్రారాక్షసమా? లేక వారిచేతివ్రాతయా?"యని

యెలమీదికి వచ్చిన రాధాకృష్ణమూర్తిగారు "అత్తునకు సంధి బహుళముగా నను సూత్రమును గ్రైకొందము. ఉదాహరణములందలి పదములకు మొదటి యచ్చుల నన్నింటి నిచ్చినా"డని రాముఁడు + అతఁడు మున్నగు నుదాహరణము లిచ్చిరే! వారు ముందు వెనుక లాలోచించిరా? చూపిన సూత్రమునకు, నుద్ధరించిన యుదాహరణ ములకు సంబంధ మున్నదా? అత్వ సంధి సూత్రమునకు నుత్వసంధి యుదాహరణము లెవరైనఁ జూపుదురా? ప్రధాన విషయములు ప్రక్కకు నెట్టుట నా లక్ష్యముగాదు గాన పాతకోటవారి పాండిత్యము నకు నవ్వుకొని వారి దోష ముపేక్షించితిని.

మూర్తిగారి కసి వారి నెట్లాడించుచున్నదో చదువరు లిప్ప టికే గ్రహించియుందు రనుకొందును. జల్పాకులయిన పాతకోటవారు వ్రాయు వ్రాతలకు నప్రతిరోధ మగు క్రోధము గాక హేతువు మఱి యొండు గలదా? కావుననే శ్రీకృష్ణుఁడు భగవద్గీతలో

"క్రోధాత్ భవతి సమ్మోహః, సమ్మోహాత్ స్మృతి విభ్రమః
స్మృతి భ్రంశాత్ బుద్ధినాశో, బుద్ధినాశాత్ ప్రణశ్యతి"

అని ప్రవచించెను.

రాధాకృష్ణమూర్తిగారికి బాలవ్యాకరణ ప్రణాళిక యర్థము గాలేదని మొదట నే ననుకొని పొరపడితిని. వారికి బాల ప్రౌఢ వ్యాకరణ సూత్రములుగూడ నర్థముగా లేదని యిప్పుడు నాకుఁ దెలిసెను. వారికి వ్యాకరణము రాదు. ఈమాట యొకసారిగాదు, వందసారు లందును. రాధాకృష్ణమూర్తిగా రాంధ్రదేశమునకు మొఱపెట్టుకొనిరి. ఆంధ్ర దేశమునకే కాదు, అఖిలభారతదేశమునకుఁ దుదకు సూరికి, నాచార్యుల వారికి వారు మొఱ్ఱపెట్టుకొన్నను లాభములేదు. నే నీ మాట అను టకు వారి వ్యాసమునుండియే రుజువులు చూపుదును.

ఆచార్యులవారు సూరి లక్ష్య లక్షణములకు సవరణములు చేసి రని తార్కాణములు చూపు సందర్భమున రాధాకృష్ణమూర్తిగారు "ఇట్లే పూఁబోడి సూరిసాధితము గాని ననబోడి, విరిబోడి యనునవి పూవుంబోడివలె ననంబోడి, విరింబోడి యని సూరిమతమున కావ లసి వచ్చు" నని తెలుఁగువారికి వ్యాకరణ రహస్యోపదేశములు చేసిరి. ఇవి బాలిశులు గాక బాలవ్యాకరణము పఠించినవారు, త్రిలింగ లక్షణ శేషము తిరుతెన్ను లెఱిఁగినవారు వ్రాయఁదగిన వ్రాతలా? సూరిమత మున "ననంబోడి విరింబోడి" యగునా? ఏమి తెలిసి పాతకోటవా రిట్లు వ్రాయుచున్నారు? వా రేనాఁ డయిన వ్యాకరణము మొగము చూచిరా? సూరిలక్షణమేమి? ఆచార్యులవారి లక్షణ మేమి? యని యాలోచింపక వంతునకు గంతువేయుచుఁ బాతకోటవారు బవంతము సేయుచున్నారు. నిరూపింతును.

బహువ్రీహి సమాసమున స్త్రీ వాచ్యమయిన, నుపమానము మీఁది మేనునకు బోఁడి యగు (బహువ్రీహిని స్త్రీ వాచ్యం బగుచో నుపమానంబుమీఁది మేనునకు బోఁడియగు)నని మాత్రమే సూరి వక్కాణించి అలరుబోఁడి ననబోఁడి పూ బోఁడి-విరిబోఁడి యను లక్ష్య ములు చూపెను. ఆచార్యులవారు "అలరుఁబోఁ డీత్యాదు లుపమాన పూర్వపద కర్మధారయంబులు-ఇటఁ బోఁడి పరం బగుచో నెల్లెడల నుమ్మగు"నని లక్షణముచేసి, యాది పద సారస్యమున తియ్యఁబోఁడి—ననఁబోఁడి – విరిఁబోఁడి - పూవుఁబోఁడి - పూఁబోఁడి యిత్యాదులు గ్రాహ్యము లనిరి.

పూఁబోఁడి యని యరసున్న రూపమును బాలవ్యాకరణము సాధింపదు. సాధించునని పాతకోటవారు ప్రవచించుట మొదటి తప్పు. ఈ రూపమేకాదు ఖండబిందువున్న యే యితర లక్ష్యములు సూరి సూత్రముక్రిందికి రావు. ప్రామాణిక బాలవ్యాకరణ ప్రతులలో ఖండ బిందువు లేని లక్ష్యములే సూరిసూత్రముకడ నున్నవి. ఒక్క "పూవుంబోఁడి" వంటివిమాత్రము బాలవ్యాకరణ మార్గమున సాధింపఁదగును. కాన "ననంబోఁడి-విరింబోఁడి" యని సూరిమత మునఁ గావలసి వచ్చునని రాధాకృష్ణమూర్తిగారు బోఁడిమాటలు వ్రాయుట రెండవతప్పు. ఆచార్యులవారే పూఁబోఁడిని సాధించిరి సూరి లక్ష్యమదిగాదు "ననంబోఁడి-విరింబోఁడి" యను రూపములు త్రిలింగ లక్షణ శేషమువలననే సిద్ధించును. ఎట్లందురా? సూరిగారు మేను నకు బోఁడి నాదేశముగా విధించిరి. బాలసరస్వతి, అహోబలపండి తుఁడు మున్నగువారిబాట పట్టి యాచార్యులవారు కేవలము "బోఁడి" శబ్దమును స్వీకరించి, యుపమానముల కది పర మగునప్పుడు [illegible]గాగమ మగునని చెప్పిరి. కాన యుదంతములుకాని నన, విరి మున్నగు నుప మానములకు "బోఁడి" పరమయినపుడు నుమాగమమై "ననఁ బోఁడి-ననంబోఁడి" "విరిఁబోఁడి–విరింబోఁడి" యను రూపము లేర్పడును. ఇది త్రిలింగలక్షణశేషమునెన్ను. దీనినిబట్టి పాతకోట వారి వ్యాకరణ పాండిత్యము పునాది లేని దని తెలియుటలేదా? సహృ దయు లాలోచింతురుగాక!

"అగునని సూత్రమున నున్నంతమాత్రమున నిత్యవిధి యని భావింపరా"దని పాతకోటవారు జూన్ "భారతి"లో భాషించిరి. "అగు నన్నచో నిత్య మని యర్థమా? దీనివలన నాచార్యులవారి శాస్త్ర జ్ఞానము తేటతెల్ల మగుచున్నది. అత్తునకు సంధి బహుళము గా నగు సూరి సూత్రము. ఇందు బహుళ మన్న చాలదా? మఱి యగునని ప్రయోగింపనేల? ఆదళ ప్రయోజన మేమి?" యనియు, "నా యుద్దే శ్యము అగునని యున్నంత మాత్రమున విధిసూత్రము కానేర దనియే. అది నియమ"మని నవంబరు "భారతి"లో వక్కాణించిరి.

పాతకోటవారి వ్రాత లజ్ఞాన మూలకములు, అవిచార మూల

కములు. వారు ఇంటి నాలుగుగోడల నడుమఁ గొలువై "అగు" నన్నపుడు తమ కిష్టమయినయర్థము చెప్పుకొనవచ్చును. బహుళమని యర్థము చెప్పుకొన్నను దాని నెవ్వరు పట్టించుకొన వలసిన పని లేదు. ఇది శాస్త్రచర్చ. బాలవ్యాకరణమునఁగాని, ప్రౌఢవ్యాకరణమునఁ గాని "అగు"నని యున్నపు డర్థ మేమి? ఆ రెండింట సూత్రరచనా విధాన మెట్లున్నది? యని పరిశీలింపవలయును. ఆలోచ్యోద్దేశ్యముల కనువయిన పట్టు గాదిది.

అగునని యున్నపుడు బాలవ్యాకరణమున నిత్యమనియేయర్థము. దువ్వూరి వేంకటరమణ శాస్త్రిగారు పలికిన పలుకులు పాతకోట వారికిఁ దెలియవు. దువ్వూరివా రిట్లనిరి.

"బాలవ్యాకరణమున సంధియగును మున్నగురీతిని "అగును" అను శబ్దముతో మాత్రమే విహిత మైన కార్యములు పెక్కులు గలవు. అవన్నియు నిత్యములనియే తాత్పర్యము......నిత్యముగా అను విశేషణము లేకుండ "అగును" అని యింతమాత్రమేయున్నను ఆ కార్యము నిత్య మనియే యర్థము. ఆయినను నాలుస్థలములందు మాత్రము వేఱుకారణములచేఁ బ్రత్యేకముగా నిత్యశబ్దమును జేర్పవలసి వచ్చినది. ఆ కారణములు ఉత్తరభాగమున సమీక్షలో నాయా సూత్రములయొద్ద పరికింతము."

బాలవ్యాకరణసంప్రదాయ మిది. కావుననే దూసి రామమూర్తి శాస్త్రిగారు "మధ్యమపురుషక్రియలం దిత్తునకు సంధి యగు"నను సూత్రమునకు "మధ్యమపురుషైకవచన బహువచనముల తుది యికారములకు నిత్యముగా సంధి యగు"నని యర్థము చెప్పిరి. వారే "సమాసంబులయందు ద్రుతంబునకు లోపం బగు"నను సూత్రమునకు "సమాసమున ద్రుతమునకు నిత్యముగ లోపము గలుగు"నని యర్థము చెప్పిరి. వంతరాం రామకృష్ణారావుగారు "అంద్వగాగమంబులం దప్ప నపదాదిస్వరంబు పరం బగునపు డచ్చునకు సంధి యగు"నను సూత్రమునకు "అచ్చునకు అందు ప్రత్యయము, లవగాగమము- అనునవి పరమయినపుడు తప్ప తక్కిన యుపదముల తొలి స్వరము పరమయినప్పుడు సంధి నిత్యముగా నగు"నని వ్యాఖ్యానము చేసిరి. ఆ ఘంటాపథ వ్యాఖ్యాతయే "అన్వాదుల కించుక్కు పరంబగు నపుడు పుగాగమంబగు; మానునకు విభాషనగు" నను సూత్రమును వివరించుచు "అను మొదలగు ధాతువుల కించుగాగమము పరమగుచో పుగాగమము విభాషనగు" నని యర్థము చెప్పిరి.

ప్రౌఢవ్యాకరణమునందుఁగూడ "అగు" నకు సూత్రకార్యము నిత్య మనియే యర్థము. ఆచార్యులవారి సూత్రములే దీనికి సాక్ష్యములు. చూడుఁడు.

"ప్రాసంబున మకారంబు పరంబగుచో ద్రుతంబునకు మకారాదేశంబగు"— "ఈ సూత్రము మకారమును నిత్యముగ విధించుచున్నదని శ్రీభాష్యము వేంకటనరసింహ భాష్యకారాచార్యులవారు వ్రాసిరి. ఆచార్యులవారి సూత్రమును విమర్శించుచు ఘంటాపథ వ్యాఖ్యాత "మకారాదేశంబగు—అని నిత్యముగ విధించుటయు సరికా" దనిరి.

"ద్విత్వయుక్త లాంతంబుమీఁది ఉలకును రుర లాదేశంబు లగు" -ఈ సూత్రమును విమర్శించుచు ఘంటాపథవ్యాఖ్యానము "ఇట ఉలలకు రురలు నిత్యముగ విధించుట సరికా"దనెను.

"దీర్ఘపూర్వకమగు లఘురేఫము హ్రస్వపూర్వకమగుచో నలఘురేఫంబగు"—ఈ సూత్రమును విమర్శించుచు వంతరాం రామకృష్ణారావుగారు "చేకురు అను లఘురేఫ ఘటిత రూపమును ప్రయోగములలో నుండుటచే నిట నలఘురేఫము నిత్య మనుట సరికా" దనిరి.

"ఆమ్రేడితంబు పరంబగునపుడు కృతహ్రస్వంబునకు దీర్ఘంబగు." "భావద్వంద్వంబునం దొలిపదంబు టవర్ణకంబునకు లోపం బగు." "వీప్సయందును గాలపరిమితియందును నామంబులకుఁ గువర్ణకంబగు" — ఈ ప్రౌఢవ్యాకరణశేషసూత్రములకు పండితప్రకాండు లగు పాతకోటవా రెట్లు భాష్యము వ్రాయుదురు?

అనన్వితములు, అవిచారిత రమణీయములు నగు వ్రాతలు వ్రాయక రాధాకృష్ణమూర్తిగారు "అగు" నని యున్నపుడది యున్న సూత్రకార్యము నిత్యమని యిప్పటికైన నంగీకరించుట లస్స. మించిపోయినదిలేదు. "బహుళముగా నగు"నని సూరి ప్రయోగించుటకు హేతువట "బహుళముగా"నని విశేష నిర్దేశక క్రియావిశేషణ ముండుటయే. కాని "అగు" కేవలము భవత్యర్థకము. ఉత్వసంధి సూత్రమును గూర్చి యూహాకదంపుడుచర్చచేసి పాతకోటవారు నవంబరు "భారతి"యందు "ఇట్టివాని కవకాశము కల్పించుటకే సూరి యీ సూత్రమును నిత్యమనక యగునని సూత్రించె"నని వ్రాసిరి. "ఇప్పు డిది విధిసూత్రమగునా?" యని ప్రశ్నించిరి. ఉత్తున కచ్చు పరంబగునపుడు సంధియగు" ననునది విధిసూత్రమే. ఇందు సందేహమునకుఁ దావేమి. (చూడు. రమణీయము. ద్వితీయ ముద్రణము పుట 39) బాలవ్యాకరణమున "అగు" "నిత్యము" అనునవి భిన్నములు గావు. "అగు నిత్యము నను రెండింటికి భేదము నాగళ్లవారికిఁ దెలియునా?"యని పాతకోటవారు ప్రశ్నించుట వారి యజ్ఞానమును నాకు వెల్లడించుటగాక మఱియొకటిగాదు. "అగు"నను సూత్రకార్యము నిత్యమని యర్థము. దువ్వూరివారిమాటలు మఱొకసారి పాతకోట వారు పరిశీలింతురుగాక!

# పొగగొట్టాల భుగభుగలు

పరిశ్రమల అభ్యుదయపు రైలుకు గార్డు చూపిన పచ్చ జెండాలు.
గిర్......ర్...ర్.......ర్.......ర్ మరచక్రాల
ధ్వనులు వినడానికి కటువుగా వున్నా, అవి దేశ ప్రగతి
వసంతంలో కోకిల కూజితాలు.

* ఆంధ్రప్రదేశ్ పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్
* రాష్ట్ర ఆర్థిక సహాయ సంస్థ
* చిన్న తరహా పరిశ్రమల అభివృద్ధి కార్పొరేషన్
* ఆంధ్రప్రదేశ్ మైనింగ్ కార్పొరేషన్
* ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక ప్రాతిపదిక సన్నాహాల సంస్థ

వంటి అనేక సంస్థలు తోడ్పడతాయి.
అచిరకాలంలోనే ఆంధ్రప్రదేశ్ మన దేశ పారిశ్రామిక
అభివృద్ధి పటంలో ప్రముఖ స్థానం అలంకరిస్తుంది.

సమాచార, పౌర సంబంధ శాఖ, హైదరాబాదు

నెం. 7/75–70

# పరిధి

## శ్రీ రామచంద్రమౌళి

మెదడంతా నొప్పి—
ఆలోచన కుమ్మరిపురుగు గుండెను తొలుస్తోంది
ఈ మసకవెలుగులో...చూరు కింద
ఖాళీ ఇంజక్షన్ సీసాలూ,
విరిగిపోయిన 'నీడిల్సూ'- నవ్వుతున్నాయి
వేయిలీటర్ల విస్కీ త్రాగినా రాని మత్తు
మెదడులో ఇప్పుడే పుట్టిన
కాంతిబిందువులోనుండి స్రవిస్తోంది
మత్తు వరదలో...నిషా సముద్రంలో
ఒంటరిగా—తెరచాప పడవలో వెళుతున్నాను

ఎటో—
ఆకాశంలో ఎర్రగా మేఘాలు తగలబడిపోతున్నదిక్కు
చుట్టూ...అంతా నీరే
నీరు మనిషిని బ్రతికిస్తుందనీ...చంపుతుందనీ తెలిసి
ఇదివరకు నీటిని ప్రేమించడం మాత్రమే నేర్చుకున్నవాన్ని
ఇప్పుడు భయపడుతున్నట్టున్నాను
సముద్రంపై...నిశ్శబ్దంలో నడుస్తున్నాను
గొంతెత్తి గాలిని గానంచేస్తూ
అలలను మీటుతూ ఓ చిత్ర శబ్దచిత్రానికి రూపు దిద్దాలని ఉంది

ఈ పాటనే
ఓసారి ఎక్కడో కోనిఫర్ వనాల్లో
ఊగే సరుగుడుచెట్లు వినిపించినట్లు పిచ్చి జ్ఞాపకం
ఎప్పుడు—ఈ జన్మలోనేనా
గతం...జ్ఞాపకాలూ

అప్పటినుండీ రెక్కలపురుగుల్లా హృదయంచుట్టూ తిరిగి తిరిగి
ఇప్పుడే ఊకయూడగొట్టుకుని పడుకున్నాయి
స్తబ్ధత...స్తబ్ధత
ఇదివరకెప్పుడో కలలో కనిపించిన వసంత దృశ్యాన్ని
వెతుక్కుంటూ...వెతుక్కుంటూ వస్తూంటే
ఇక్కడ ఇదేమిటి ఎండిపోయినచెట్లు వికృతంగా నవ్వుతున్నాయి

వీటి పాదాల దగ్గర తీగలు తెగిన గిటార్
సగం భూమిలో పాతుకుపోయి ఉంది—
తీగలులేని గిటార్...మెదడులేని మనిషి
ఇది మళ్ళీ పాడేదెప్పుడు
ఒడ్డున కూర్చుని ఆకుపచ్చని ఊబిక్రింద
స్వచ్ఛమైన నీటి జలను చూస్తూ ఉండిపోయానొకనాడు

ఊబిని చిమ్మేస్తే...చీకటిని ఒలిచేస్తే
వెలుగు...వెలుగులాంటి నీరు—
సాన పట్టింది బొగ్గు వజ్రం కాదు
వజ్రంమాత్రం బొగ్గవుతుంది
కరిగిపోతున్న కొవ్వొత్తి కార్చుతున్న
నిప్పులాంటి కన్నీటిధార దగ్గర కూర్చుని
ఈ పుస్తకాలతో తలను బద్దలుకొట్టుకుంటూంటే
హాయి—పావురం రెక్కల్లా విచ్చుకుంటున్నది
నా మెదడు బిందువు చుట్టూ గీసుకున్న
పరిధి పెరిగి...పెరిగి
అనంతంలోకి చొచ్చుకుపోతోంది.

---

# కేంద్రసాహిత్య అకాడమీ అవార్డు పొందిన అభ్యుదయ కవిత్రయం

శ్రీ శివలెంక ప్రకాశరావు

అభ్యుదయమంటే ప్రగతిశీలకమైన మార్పు. మార్పనేది జీవలక్షణం. శ్రామికవర్గ చైతన్యాన్నీ, వారి జీవిత సమస్యలనూ దృష్టిలో పెట్టుకొని వ్రాసేదే అభ్యుదయ కవిత్వం.

దీనికి శబ్దసరళత, శిల్పసరళత ముఖ్యలక్షణాలు. సామ్రాజ్య వాదులకూ, ప్రజాపీడకులకూ విరుద్ధంగా జరిగే పోరాటాలనూ, తిరుగుబాట్లనూ కవితా వస్తువుగా స్వీకరించి అభ్యుదయకవులు రచనలు సాగిస్తున్నారు. నేటి సాహిత్య ప్రియు లందరూ ఈ రచనలను వచన కవిత్వంలో వున్నా ఆదరిస్తున్నారు. అందుకే వచన కవితా ప్రక్రియలో కోకొల్లలుగా కవితా సంపుటులు వెలువడుతున్నాయి. ఇది నేటి సాహిత్యాభివృద్ధికొక నిదర్శనం. అయితే వీటిలో గుణప్రాధాన్యాన్ని బట్టిచూస్తే ఈ సంఖ్య చాలా స్వల్పమనే చెప్పాలి. అటువంటి ఉత్తమ సాహిత్యాన్ని ప్రోత్సహించడం కొరకు రాష్ట్ర, కేంద్ర సాహిత్య అకాడమీలు ప్రతి సంవత్సరమూ ఉత్తమ గ్రంథములకు బహుమతులను ప్రకటిస్తున్నారు. కేంద్రసాహిత్య అకాడమీవారు ఒక్కొక్క గ్రంథానికీ అయిదువేల రూపాయలూ, రాష్ట్ర సాహిత్య అకాడమీవారు వెయ్యి రూపాయలూ నగదుగా ఈ బహుమతిని అందిస్తున్నారు!

1971, 1973, 1974 సంవత్సరాలలో వరుసగా స్వర్గీయ దేవరకొండ బాలగంగాధర తిలక్ 'అమృతం కురిసిన రాత్రి', శ్రీ సి. నారాయణరెడ్డి 'మంటలూ—మానవుడూ', శ్రీ దాశరథి 'తిమిరంతో సమరం' అనే అభ్యుదయ కవితా సంకలనాలకు కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డులు రావడం విశేషం.

వాటిని ఉత్తమమైనవిగా ఎన్నుకోవడంలోగల విశేష మేమిటో వివరించడమే ఈ వ్యాసోద్దేశం.

బాల గంగాధర తిలక్ అటు భావకవి యుగానికీ, ఇటు అభ్యుదయ కవియుగానికీ ఒక వారధిలాంటివాడు. అందుకే 'తిలక్ కవిత అభ్యుదయ కవిత్వం కొన్ని పాళ్లు, భావకవిత్వం కొన్ని పాళ్లు కలిసిన మిశ్రమరూపం' అంటూ విమర్శించారు శ్రీ కుందుర్తి తాము వ్రాసిన పీఠికలో.

'నా అక్షరాలు ప్రజాశక్తుల వహించే విజయ ఐరావతాలు, నా అక్షరాలు వెన్నెలలో ఆడుకునే అందమైన ఆడపిల్లలు' అని తిలక్ అనడంలో ఇదే విషయం స్పష్టంగా కనిపిస్తుంది.

మొత్తం 64 కవితలలో రెండవ దైన 'అమృతం కురిసిన రాత్రి'ని బట్టి ఈ సంకలనానికీ పేరు పెట్టబడింది.

అందరూ నిద్రపోతున్న ఒక రాత్రి సమయంలో తిలక్ ఒక్కడూ ఇంటినుంచి దూరంగా వెళ్ళి ఒక మైదానంలో నిలబడ్డాడు. ఆకాశంమీద పరుగెత్తుతున్న అప్సరసలు కన్పించారాతనికి వారి 'పాదాల తారా మంజీరాలూ', ధమ్మిల్లాల పారిజాతాలూ', 'యౌవన ధనుస్సుల్లా' వంపులుతీరిన 'ఒయ్యారాలు' కవి నాకర్షించాయి. వాళ్లూ తిలక్‌నుచూసి 'అందమైనవాడు, ఆనందం మనిషైనవాడు.. జీవితాన్ని ప్రేమించినవాడు, జీవించడం తెలిసినవాడు, నవనవాలైన ఊహా వర్ణార్ణవాలమీద ఉదయించిన సూర్యుడు, ఆతడే సుమీ మన ప్రియుడు, నరుడు, మనకి వరుడు' అని తమలో తాము అనుకున్నారు.

కవి ఒక్కొక్కసారి తననుగూర్చి తానే చెప్పుకుంటాడు. ఇది ఆత్మాశ్రయం (subjective) లో కనిపిస్తుంది. అలాగే ఒకపాత్రను ఆశ్రయించుకొని ఆ పాత్రముఖంనుంచి తాను చెప్పదలచుకున్న విషయాన్ని వివరిస్తాడు. ఇది పరాశ్రయం (objective). ఇక్కడ తిలక్ తననుగూర్చీ, తన కవితా తత్వాన్నిగూర్చీ అప్సరసలచే చెప్పించాడు.

అప్పుడు ఆరాత్రివేళ కురిసిన అమృతాన్ని తనివితీరా గోలి సుఖానికీ, మృత్యువుకూ స్వస్తి చెప్పి అమరుడయాడు తిలక్. కాని

మిగిలినవారందరూ 'నిత్యజీవితంలో అలసి సొలసి అలవాటునీ, అస్వతంత్రతనీ కావలించుకొని అధైర్యంతో ముడుచుకొని నిద్రపోయారు..

అయితేనేం?

'సంకుచితమైన జాతిమతాల సరిహద్దుల్ని చెరిపి వేస్తున్నాను నేడు, అకుంఠితమైన మానవీయ పతాకను ఎగురవేస్తున్నాను చూడు, చరిత్రల రక్తజలధికి స్నేహ సేతువు నిర్మిస్తున్నాను రండి, కవి వచస్సవితృకాంతిపూరమిది, స్వేచ్ఛగా జలకమాడండి' అంటూ అందరినీ ఆహ్వానించిన నిస్వార్థపరుడూ, విశాలహృదయుడూ తిలక్.

ఈ వసుధ కంతకీ తిలక్ 'సర్వంసహా చక్రవర్తి'లా సాక్షాత్కరిస్తాడు మనకి.

ఎందుకంటే 'భూమధ్యరేఖ అతని గుండెలోంచి' దూసుకుపోతోంది. 'సూర్యుడు తలమీది పువ్వులా' ఉన్నాడు. అతడు తన రెండు పాదాలూ 'ఉత్తర దక్షిణ ధ్రువాలమీద' నిలిపాడు.

తిలక్‌కవితకు ముఖ్యంగా బాధ జీవగర్ర. అందుకే 'నా అక్షరాలు జడుంలో తడిసే దయా పారావతాలు' అంటాడు. అంతేకాదు. నేను కన్నీరుగా కరిగిన గీతికను, సిగ్గుతో రెండుగా చీలిన వెదురు బొంగును...మంటలో అంతరాంతర దగ్ధమైన బూడిదను' అంటూ 'ఆర్తగీతం' ఆలపిస్తాడు తిలక్.

అందుకే 'ఆకలితో అల్లాడి మర్రిచెట్టుకింద మరణించిన ముసలివాణ్ణి, వర్షంలో వంతెనకింద ప్రసవించిన నిండుచూలాల్ని, తిండిలేక ఏడ్చి ఏడ్చి మురికికాల్వపక్క నిద్రించిన పసివాణ్ణి' చూసి నీరుకారిపోయాడు తిలక్.

'మానవత లేని లోకాన్ని స్తుతించలేను
మానవునిగా శిరసెత్తుకు తిరగలేను
ఈ నాగరికతారణ్యావాసం భరించలేను'

అని ప్రకటించడంలో అతని మానవతా వాదతత్వం ప్రస్ఫుటమవుతుంది.

తిలక్ కవితలో ప్రతిపదంలోనూ ప్రధానంగా అనుభూతి కనిపిస్తుంది. పరిస్థితుల ప్రభావానికి భయపడుతూ మూఢాచారాల కలుగుల్లోంచి బయటపడలేనివారిని 'తోకలు తెగిన ఎలుక'లని వాపోతాడు తిలక్ అలాగే మధ్యతరగతికి చెందిన ఎన్జీవోలను 'గొంగళి పురుగు'లతో పోలుస్తూ, జీవచ్ఛవాల్లా బ్రతుకుతూ, సగం సగం తిన్న కలల్ని నెమరేస్తూన్న బల్లపరుపు జీవితానికి ప్రతీకలైన కోటేశ్వరరావు, సీరేశ్వర్రావులాంటి వారిని ఉదాహరిస్తాడు.

నెహ్రూ చనిపోయినరోజు రుద్ధకంఠంతో 'ఈవేళ పువ్వులన్నీ వాడిపోయినరోజు. ఏకాంతంలో భూమి ధ్రువ గళాలెత్తి ఏడ్చినరోజు. తెల్లని పావురం ఎండలో సొమ్మసిల్లిపోయింది' అంటూ విలపిస్తాడు తిలక్.

తిలక్ అతని మనస్తూలికతో గీసే పద చిత్రాలూ, భావ చిత్రాలూ చిత్రవిచిత్రాలుగా ఉంటాయి. మన హైదరాబాదు నగరం మీద కవి వ్రాసిన ప్రేమగీతం చూడండి. ఆ నగరాన్ని ఒక నవోఢతో ఉపమిస్తూ, అక్కడి వివిధ ప్రదేశాలూ ఆమె వివిధాంగాలతో సరిపోలుస్తాడు. టాంక్‌బండ్—నడుము, అబిడ్స్—కళ్ళు, దీపాల వెలుతురు ప్రతిబింబించే విశాలమైన ప్రాంతాలు—చెక్కిళ్ళు, నౌపహాడ్—నాగరం, బంజారాహిల్స్—వక్షోజాలు. సికింద్రాబాద్—జఘనోరుభాగం. ఇది కవి గీచిన వర్ణచిత్రం.

అలాగే గోదావరినదిలో రాజమండ్రి తెప్పలాగా తేలుతోందనీ, అక్కడి రైలుబ్రిడ్జి ఆ వృద్ధమాతకు ముత్యాల వడ్డాణంగాను, మసక మసగ్గా ఉన్న విద్యుద్దీపాలు చత్వారపు నేత్రాల్లాగాను, కొండలు గున్న ఏనుగుల్లాగాను ఉన్నట్లు చిత్రిస్తాడు తిలక్.

ధ్వని గర్భితమైన కావ్యమే ఉత్తమకావ్యమన్నారు ఆలంకారికులు. అదే దృష్టితో పరిశీలిస్తే 'అమృతం కురిసిన రాత్రి'ని ఒక ఉత్తమ కావ్యమని చెప్పవచ్చు. ఎందుకంటే తిలక్ మాటలు ఒక్కొక్కచోట ధ్వనిగర్భితాలుగాను, సద్విమర్శనాపూర్వకములుగాను, పతితుల హృదయాలకు సూటిగా తగిలే చెణుకుల్లాగాను కనిపిస్తాయి, వినిపిస్తాయి.

ఉదాహరణకు 'మ్యా సిలబస్' చూడండి—'అమెరికాలో డాలర్లు పండును ఇండియాలో సంతాపం పండును.' 'ప్రజాస్వామ్యదేశాలలో భరకాంతలు ప్రీడావతులు, సామ్యవాద రాజ్యాలలో కాశికులే మత గురువులు'. 'గజానికో గాంధారి కొడుకు గాంధీగారి దేశంలో.' 'పల్లెటూరి పిల్లకి సినీతార దివా స్వప్నం, పట్నవాసం షోకిల్లాకి హాలీవుడ్ భూతల స్వర్గం' 'సుందరాంగుల జాగ్రఫీలో విద్యార్థులు నిమ్నోన్నతాలు గుర్తిస్తారు—సువర్ణాంకన్న అగ్రవర్ణం లేదని సకల కులాలవారూ అంగీకరిస్తారు'. 'ఘనాఘనంగా గర్జించింది ఆఫ్రికన్ ఘనా, పంచశీలలో ఊడిపోయిన సీలపేరు చైనా'—ఇత్యాదులు.

'గదికీ మదికీ గవాక్షాలుంటూ' యనీ అవెప్పుడూ తెరిచి ఉంచితేనే విశాల దృక్పథం ఏర్పడుతుందనే తత్వం కలవాడు తిలక్.

ఉగాదినిగూర్చి వ్రాసిన 'శిఖరారోహణ' కవిత తలమానిక

మైంది. 'లైట్లు వెలిగిన స్టేషన్‌లోకి రైలు వచ్చినట్లుగా కొత్త సంవత్సరం హుషారుగా కొత్తగా రావాలి మన మధ్యకి' ఇది తిలక్ ఆకాంక్ష.

'మూడు ముక్కలాట' మొదలు 'వ్యాకులం' వరకూ, తన ఇంటి కిటికీనుంచి 'టురాన్' పట్టణం వరకూ అన్ని విషయాలనూ కవితా వస్తువుగా తీసుకొని కవితలో నవత చూపించాడు తిలక్.

'కవిత ఉన్నప్పుడే నవత రాణిస్తుంది
అసలు కవితలోనే నవతదాగా వుంది' ఇది తిలక్ దృష్టి.

'కవిత్వంలో అస్పష్టానికి కొన్ని సందర్భాలలో వుండొచ్చు కాని పాఠకుడికి నీ అనుభవానికి, ఆకారం అందాలి. హృత్కోశాల్, అది ట్రాన్స్ పరెంట్ చేసేట్టు ఉండాలి. నిన్ను పలకరించాలి, కవిత కొత్త అనుభవాల కాంతిపేటికను తెరవాలి, పలవరించాలి' ఇది తిలక్ కవితా లక్ష్యం.

నారాయణ రెడ్డిగారి అభ్యుదయ వాదానికి, మానవతా వాదానికీ అద్దం పట్టి చూపించే కవితా సంకలనమే 'మంటలూ — మానవుడూ' అనే రెండవ పుస్తకం.

నేటి సమాజంలోని సామాన్య మానవుని స్థితిని తెలిపి, అతని హృదయ కుటీరంలో చెలరేగే మంటల్ని చూపించే మొదటి కవితను బట్టి ఈ సంకలనానికి పేరు పెట్టడం జరిగింది. ఇక్కడ మంట అనేది మనస్సులో రగిలే క్రోధాగ్నికి ప్రతీక.

ఈ మంటలు నేటి సమాజ వ్యవస్థలో 'పట్టపగలు పట్ట పిలుపునా ప్రజ్వలించే మంటలు'. మానవుల 'మస్తకాల్లో, మస్తిష్కాల్లో కన్నుల్లో కాళ్ళల్లో' వ్యాపించిన ఎంతకూ చల్లారని ఎర్ర మంటలు, ఎర్రని మంటలు ఇవి.

శ్రామికవర్గం ప్రజ్వలింపజేసే ఈ మంటలను పాలకవర్గం చెదిరిపోయింది. ఆలోచించి లాకౌట్ ప్రకటించింది. ఇంకేముంది? 'మంటలు కుప్పకూలిన్నై, నిప్పుల చల్లారిన్నై.' కాని మనిషి చల్లారలేదు. అతని హృదయాబ్ధిలో బడబాగ్ని రగులుతూనే ఉంది. అదెప్పుడో ఒకప్పుడు విజృంభించకపోదు.

అందుకేనని 'సముద్రమే పొంగినప్పుడు సమాజం పొంగదేం చేస్తుంది?' జనమే ఉప్పొంగినప్పుడు జనం ఉప్పొంగకుండేం చేస్తుంది?' అని ప్రశ్నించి చైతన్యమూ, హృదయమూ ఉన్న ప్రతిమనిషీ విప్లవ ఒకప్పుడు ఎదురు తిరుగుతాడని చెబుతాడు.

ఇందులోని 30 కవితలలో 'పరమహంసలారా' అనేది నేటి ఎన్జీవోల స్థితిగతుల్ని చూపుతుంది.

'పండగచేసుకుంటున్నారా
పరమ హంసలారా
చేసుకోండి చేసుకోండి'

అంటూ ఉగాదిపండుగనాడు 'ఫాల్స్ ప్రిస్టేజ్' కోసం మధ్యతరగతి ఉద్యోగిపడే ముప్పుతిప్పల్ని విప్పి చెపుతాడు కవి.

'మీలో రాగు లున్నారు, యోగులున్నారు, ఉత్త ఉపసర్గలతో ఉప్పొంగిపోయే ఉద్యోగులున్నారు విశ్రాంతి కాంతకోసం గంగ వెర్రు లెత్తే నియోగులున్నారు' అంటాడు. ఈ ఉద్యోగులకు వచ్చే టి.ఏ.లూ, డి. ఏ లు ఉపసర్గలు. పెరిగే జీతం విశ్రాంతికాంత.

నిరాశా నిస్పృహలను విడిచిపెట్టమని ఉద్బోధిస్తూ

'పేడితనం కసవులా చిమ్మేసి
క్రీడితనం రుజావుచేసుకోవాలి
ముచ్చెమటలూ రిచ్చపాట్లూ మానేసి
ముచ్చిచ్చులా అల్లుకుపోవాలి'

అంటాడు సి. నా. రె.

మారుతున్న కాలంతోపాటు ప్రతివాడూ మారాలని బోధించేది 'ఇంకిపోయిన బావి' అనే కవిత.

'ఉల్లీ మల్లీ వాసనలు భిన్నంగాఉన్నా ఉన్ననేల ఒకటే అంటూ మానవుల అంతస్సుల తేడాల్ని ఎత్తి పాడుస్తాడు.

'జోడెద్దులు కుమ్ముకుంటున్నవి
కాడివిరిగేటట్టు
బండిలోని ధాన్యంబస్తాలు
బజారులో చెరిగేటట్టు'

అని నేటి రాజకీయపార్టీ దొమ్ములాటలను ధ్వనిస్తాడు కవి.

కొవ్వొత్తి గుండెలోతూ, అగర్వత్తి అంతర్మథనం గుర్తించ గలవాడే సరైన మానవుడు' కవిదృష్టిలో.

'శ్రమజీవి చెమటబిందువులో ఆణిముత్యమూ ఉంది, అగ్ని గోళమూ ఉంది' అని సరికొత్త సత్యాన్ని చాటిన అభ్యుదయవాది నారాయణరెడ్డి.

ఏ విషయం చెప్పినా సూటిగా హృదయానికి గాఢంగా నాటు కునేటట్లు చెప్పడం సి. నా. రె. గారి ప్రత్యేకత. చూడండి 'చిరు నవ్వులు' అనే కవిత. ఎన్ని రకాల నవ్వుల్ని పట్టి చూపిస్తాడో ఈ క్రాంత దర్శి.

'కొన్నేమో మందర చిరునవ్వులు— కొంపల్నే కూలుస్తాయి, కొన్ని క్లియోపాత్రా చిరునవ్వులు-కోటల్నే పెళ్లగిస్తాయి. అప్పుడే తీసిన వెన్నపూసలా చప్పున తెలిసే చిరునవ్వులు కొన్ని, అర్థ తాత్ప ర్యాలిస్తేతప్ప అంతుచిక్కని చిరునవ్వులు కొన్ని. నాయికల చిరు నవ్వులోలేంది నాయకుల చిరునవ్వులో ఉంటుంది. మంత్రకాని చిరు నవ్వు చేయలేంది – మంత్రిగారి చిరునవ్వు చేస్తుంది.' , అందుకే 'నవ్వు నాలుగువిధాల చేటు' అని పెద్దలన్నారేమో !

అయితే 'అంతుపట్టని చిరునవ్వులుంటాయని అసలు చిరు నవ్వుకే ఎసరు పెట్టరాద'ని నచ్చచెపుతాడు కవి.

సి. నా. రె. స్నేహశీలి. తనకు వ్రాసిన ఉత్తరాలకు జవాబు లీయడంకన్న ఉత్తమరచన లేదంటాడీయన.

'అన్ని నోసళ్లకూ కావాలి పొద్దు
అన్నినోళ్లకూ అందాలి ముద్ద'— ఇది కవికోరిక.
'గణంకంటె గుణం ముఖ్యమని

రాశికంటె రమ్యత శ్రేష్ఠమని'— ఈయన లోకం బడిలో నేర్చుకున్న పాఠం.

'నెమలిపింఛంలా విప్పుకున్నదే
నిజమైన జీవితం'—ఇది కవిఆదర్శం.

'ఆర్తిమూర్తులకు వెలకట్టు'గల షరాబు నారాయణరెడ్డి. 'గుండెల సవ్వడి—డిండిమాల అలజడి కొలిచి' చూడగల ప్రాజ్ఞుడు ఈయన.

'రామన్న ప్రభాతం రాకతప్పదు
రక్తశుక్తి సత్యమౌక్తికాన్ని
ప్రసవించక తప్పదు, నవధర్మం

ప్రభవించక తప్పదు! — ఇది కవివిశ్వాసం. దీనితో వ్రాసినదే 'మంటలూ—మానవుడూ' అనే కవితాసంపుటి.

మూడవ పుస్తకం 'తిమిరంతో సమరం.' ఇది శ్రీ దాశరథి వ్రాసిన కవితాసంకలనం.

దాశరథి నేటి అభ్యుదయ రథసారథి. 'నా తెలంగాణ కోటి రాత్నాలవీణ' అంటూ తెలంగాణావిముక్తికై గళంలో 'రుద్రవీణ' పలికించి, కలంలో 'అగ్నిధార' నొలికించిన వీరుడు దాశరథి.

జాతీయోద్యమ భావావేశంలో శ్రామికవర్గ చైతన్యాన్ని మేళ వించటం ఈయనకవిత్వంలో ఎక్కువగా కనిపిస్తుంది.

తిమిరం మూఢత్వానికీ, మూర్ఖత్వానికీ, తిరోగమనానికీ ఒక ప్రతీక. కలం అనే ఖడ్గం ధరించి తిమిరంతో సమరం సాగించేవాడే కవి.

వస్తుతః అన్యాయాన్నీ, అక్రమాన్నీ చూసి ఓర్చుకోలేని తత్వం కలవాడు శ్రీ దాశరథి.

'పిచ్చుకపై బ్రహ్మాస్త్రం
వేసేవారున్ననాడు
అవనిపైన శాంతిలేదు
అనిసేయుట ఆగిపోదు.'

అని ప్రస్తుత కాలంలో స్వార్థపరుల దౌష్ట్యాన్ని గుర్తుచేస్తాడు కవి. అయితే ఈ 'జయపతాకం ఎన్నాళ్ళని ఎగురుతుంది?' అని ప్రశ్నిస్తాడు.

సమాజంలో ఈనాడు జరుగుతున్న అన్యాయానికీ, అక్రమానికీ మానవుని అధైర్యమే కారణమని రుజువుచేస్తూ కవి.

'ఇంకుతున్న మానవుడా
ఇంకనైన మేల్కొంచు
తుపాకీల హతంచేసి
కృపాకీల వెలిగించు' అంటాడు.

అశాంతి, అరాచకం వ్యాపింపచేస్తున్న వారిపై దాడిచేయండంటూ— 'జుగుప్సను చుట్టి పారేయండి, క్రౌర్యాన్ని కట్టి పారెయ్యండి, బీభత్సాన్ని విసరి పారేయండి' నైచ్యాన్ని నలిపి పారేయండి.' అని ఉద్బోధిస్తాడు.

కవికున్న భావోద్రేకాన్ని అర్థంచేసుకోడానికి 'ప్రణాలతో రణాలు' అనే శీర్షిక పరిశీలించండి.

'నా మానని గాయాల వజ్రాయుధాలతో
అధికార మదాంధుల
బధిర హృదయాలను బ్రద్దలుకొడతాను......
అవనిని ఆనందభవనంగా కళకళలాడిస్తాను !

దాశరథిగారి శాంతిప్రియత్వాన్ని, విశాల హృదయాన్ని పట్టిచూపే ఈ పదాలు చూడండి.

'సమర రాక్షసి నశించాలి
శాంతిదేవత హసించాలి
స్వాతంత్ర్యం సౌజన్యం
సౌభ్రాత్రం వసించాలి'.

'శాంతి'కి 'శాంతమ్మ' అని మానవత్వం ఆరోపించి ఆమెను 'ఉగాదివై—నా ఆశల పునాదివై, సమరానికి సమాధివై, జగాలలో ఆవరించు' అని ఆహ్వానిస్తాడు.

'ఒంటరివాని జీవితంలా కుంటుతున్న కాలాన్నీ పిరికివారిలా పారిపోయే దేవతల్నీ మెచ్చుకోని స్వభావం దాశరథిది. పైకి ధరణిలా ఓర్పు కలవాడిగా కన్పించినా, లోపల జలధిలా గంభీరంగా పరుగెడతాడు దాశరథి.

'ప్రతి చీకటిరేయినుండి భానుబింబ మవతరించు ప్రతికిరణం ప్రగతి' చరణం అనే ఆశావాది దాశరథి.

'డబ్బు రుబ్బురాయికింద నలిగే డాబుసరీ సమాజం కన్న రెక్కాడితే డొక్కాడే నిరుపేదల నిండుగుండె మిన్న' అనే మానవతావాది దాశరథి.

'గడియారం నడవని పాతకోట గోడకన్న సూర్యుడ్ని ఉరికించే ఫ్యాక్టరీకూత మిన్న' అనే అభ్యుదయవాది దాశరథి.

'మారినపుడే అది కాలమనీ. మారనిది శునకవాలమ'ని కవి విశ్వాసం.

ఈమధ్య తెలుగువారికి వచ్చిన విభేదాలను విమర్శిస్తూ 'తెలుగుజాతి ఒక్కటి, భరతజాతి ఒక్కటి' అని చాటి చెపుతాడు.

'అభాగ్యులం కాము మనం
భాగ్యనగరి మనది
అపజయం లేదు మనకు
విజయవాడ మనది

వచనకవితతోపాటు 'కందగంపద్యం వ్రాసే కంచుగంటం కవి' దాశరథి. నెహ్రూను గూర్చి వ్రాసిన పద్యాలు ఉదాహరణలుగా చెప్పవచ్చు.

ఈ విధంగా ఈమధ్య వెలువడిన అభ్యుదయ సాహిత్యంలో పైన వివరించిన మూడు కవితాసంకలనాలూ కేంద్ర సాహిత్య అకాడమీ గౌరవాన్ని పొందడానికి అర్హమైనావి. ఈమూడు సంపుటాలూ నేటి సాహిత్యచరిత్రలో మూడు మైలురాళ్లని చెప్పవచ్చు



# నా లేఖిని శిలీముఖి

## శ్రీ సోమసుందర్

సూర్యుణ్ణీ చంద్రుణ్ణీ నిరువడిగి తెచ్చుకున్నాను
నా కుడికంటికీ ఎడమకంటికీ సరిపడే గాజుబిళ్లలు
అమర్చుకున్నాను సులోచనాలు
కనుకనే నేనిపుడు క్రాంతదర్శిని

వరుణుడు కరుణాశీలుడు నా కోసం పంపించాడు:
తెల్లనివీ ఊదావీ నీలివీ - మబ్బు తానుల్ని
కత్తిరించి లాల్చీలు కుట్టించుకున్నాను...
మెత్తని సెలయేటి కెరటాల కొసలతో అల్లుకున్నానురుమాళ్ళు
గులాబీలతో అలంకరించుకున్నాను నా తెరలు

అంతరిక్షం మంచి మంచి నక్షత్రాల నేరి నా కందించగా
కవితా సరస్వతికి కంఠమాల చేయించాను

హిమవంతుడు నాకోసం పంపించాడు తెల్లని మంచుముక్కలు
చందనాది నవీన వనమూలికారసాల మెదిపి
గంగా సింధు నదీజలాలలో నానబెట్టి
మలయ గంధవహుని రెక్కలపై ఆరబెట్టి
పంపించాడు నాకు హంసమెడకు కట్టి ...
ఆ తెల్లని 'హిమానీ' మంచు ముక్కనే నేను
వాడుతున్నాను తనివోని సబ్బుబిళ్ళగా !
కనుకనే వజ్రగాత్రుడనై మెరుస్తున్నాను

"నేను హిమవంతుని ఆస్థాన కవిని" అంది హంస
తన పరిచయ పత్రం విప్పింది
"నీ కవితా కీర్తి చంద్రికల్లో విహరించాను
కనుకనే ఈ అమూల్య బహుమానం తెచ్చాను!"
అన్నది హంస, మానవ భాషణలో, దయార్ద్ర హృదయంతో
తన రెక్కలలోని నవరత్నాలు తాపిన అపరంజి ఎరికను
ఒకదాన్ని ముక్కుతో పెరికింది -
అదే నా లేఖిని ... ఒఖుంఠిత శిలీముఖి !

కామధేనువు నాకోసం పధునాల్గు భువనాలూ గాలించింది
తన రెండుకళ్ళూ నాకోసం అనాయాసంగా త్యాగం చేసింది
అబ్బో అవి కన్నులా? అన్నులమిన్నులు, అందాల పెన్నిధులు !
నా పడకటింటి కవే కిటికీలుగా నిర్మించిందటూ ఖటూ...

ఉభయ సంధ్యలూ వంచి ప్రాక్పశ్చిమాలనుంచి
నా దివారాత్ర రుచిర స్వప్నాలకు
నా కళా పరమ సత్యాలకు సువర్ణాలు సేకరించుకున్నాను.

కనుకనే నేనిప్రుడు అక్షర జగత్పతిని
కవితాభ్యుదిత సవితృ నేత్రుణ్ణి ...
శాస్త్ర జ్ఞాన ఫాలలోచనుణ్ణి
ఆధునిక మహా మానవుణ్ణి ... ... !

# ద్రవ్యోల్బణం: దాని సాంఘిక పరిణామాలు

శ్రీ బారు గోవిందరావు

ద్రవ్యోల్బణం అంతరార్థాలను, సమాజంమీద, దాని పరిణామాలను మనం పరిశీలించవలసి ఉంది.

యుద్ధం సమయంలోగాని, ఆర్థికాభివృద్ధి కోసంగాని ప్రభుత్వం కరెన్సీని, బాంకు పరపతిని అతిగా పెంచడంవల్ల ఏర్పడిన పరిస్థితిని ద్రవ్యోల్బణమంటారు. కరెన్సీ రోజువారీ చలామణీలో అయినా ఉండవచ్చు; లేదా కొనుగోలుశక్తి నిధుల రూపంలో నైనా ఉండవచ్చు. ప్రారంభంలో అధికద్రవ్యం వస్తువుల ధరలలో కొద్ది పెరుగుదలకు దారితీస్తుంది. ధరలు పెరిగినందువల్ల ప్రభుత్వం కొనే వస్తువులకు, సేవలకుగాను వ్యయమెక్కువౌతుంది. అందువల్ల ఇంకా ఎక్కువగా కరెన్సీని జారీచేస్తుంది; దాని చలామణీవేగం పెరుగుతుంది; కొనుగోలుశక్తి తగ్గుతుంది. కాగితపుద్రవ్యం (Paper Currency) విలువల కొలమానంగా, విలువల నిధిగా ప్రజల విశ్వాసాన్ని కోల్పోతుంది. కాబట్టి ద్రవ్యోల్బణం మరీ అధికమౌతుంది. ఆహారానికి లభించే వస్తుప్రవాహంతో పోలిస్తే మొత్తం ద్రవ్యవ్యయంలో మార్పు రావడమే ద్రవ్యోల్బణానికి మూలకారణము. సమాజంలో దుష్పరిణామాలకు కారణభూతమౌతుంది; ప్రభుత్వానికొక సమస్యగా పరిణమిస్తుంది.

చట్టరీత్యా చెల్లింపులధికార మున్న నాణెములు, కాగితపు నోట్లను ప్రభుత్వాలు జారీచేస్తాయి, పెరిగే ప్రజావసరాలను తీర్చడానికి, భారతీయ బాంకింగ్ వ్యవస్థ రూపొందింది. రిజర్వుబాంకు ద్వారా మనప్రభుత్వం తన ద్రవ్యవిధానాన్ని అమలు జరుపుతుంది; జాతీయ నిధులను పరిరక్షిస్తుంది. మనమిప్పుడు ప్రజాస్వామ్యం, సమసమాజం, శ్రేయోరాజ్య ఆదర్శాలకు కట్టుబడి ఉన్నాము. అందువల్ల ప్రజల సాంఘిక, ఆర్థిక జీవితం కొన్ని విధి, నిషేధాలకు లోబడి ఉండవలసి ఉంటుంది. మన అభివృద్ధి ప్రణాళికలకు, పూర్ణోద్యోగితా సాధనకు ద్రవ్యవనరులు కావాలి. అయితే, బాంకు పరపతిని హేతుబద్ధంగా పంచిపెట్టకపోతే, ద్రవ్యోల్బణస్థితి ప్రమాదకరంగా పరిణమిస్తుంది.

ద్వితీయ ప్రపంచ మహాసంగ్రామంలో, యుద్ధకృషికిగాను రూపాయలలో అయ్యే వ్యయాన్ని, భారతదేశం భరించవలసి వచ్చింది; ఋణాలు తీసుకున్నది. 1943లో ద్రవ్యోల్బణ పరిస్థితిని గమనించి దాన్ని అదుపులో పెట్టేందుకు ప్రభుత్వం చర్యలు తీసుకున్నది. ఎటు, వ్యాపారాన్ని అదుపులో ఉంచడానికి, ఆహార పదార్థాలు, వస్త్రాలు వగైరా వస్తువుల సప్లైమీద కంట్రోళ్ళు విధిస్తూ అత్యవసర చట్టాలు చేసింది. ఖర్చుపడకుండా మిగులుపడి ఉన్న ద్రవ్యాన్ని హస్తగతం చేసుకునేందుకు ఆదాయంమీద, లాభాలమీద పన్నులు వేసింది. రవాణా, సమాచార సౌకర్యాలను సమకూర్చే శక్తిని పెంచింది. ప్రస్తుతం ఇవన్నీ కొద్దో గొప్పో ఉన్నాయి. ద్రవ్య

ప్రాముఖ్యం తగ్గించేందుకు కేంద్రీకృత పరిపాలన ఉండే ఆర్థిక వ్యవస్థ అవసరమని రెండుయుద్ధాలు ఋజువు చేసినాయి. ప్రపంచ బాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి స్థాపించబడినాయి. మనకు సహాయం చేస్తున్నాయి. యుద్ధం తర్వాత, భారత ప్రభుత్వం ద్రవ్యోల్బణ స్థితిని అదుపులో పెట్టలేక, ప్రజలకు కొంత ఉపశాంతి చేకూర్చ డానికి కంట్రోళ్లను చాలావరకు తొలగించింది.

స్వరాజ్యం వచ్చిన తర్వాత అభివృద్ధి ప్రణాళికలమీద వ్యయం పెంచవలసి వచ్చింది. పన్నులు, ప్రజల పొదుపుల మూలకంగా తగినంత ద్రవ్యవనరులు రాబట్టలేక పోయినందువల్ల ప్రభుత్వం లోటు బడ్జెట్ల (deficit budgets) విధానాన్ననుసరించి, ఆదాయంకన్న ఎక్కువగా ఖర్చుపెట్టవలసి వచ్చింది. 1949లో రూపాయి మూల్య న్యూనీకరణ (devatuation) వల్ల మన ఎగుమతులు, బాంకుల పరపతి, పారిశ్రామిక, వ్యవసాయిక ఉత్పత్తి, లాభాలు, వేతనాలు పెరిగినాయి; వీటితో ధరలుకూడాను. మొత్తం ద్రవ్యసప్లైకి, వస్తుసేవల (goods and services) పరిమాణానికి అసమతౌల్య మేర్పడింది. ప్రభుత్వం తన వ్యయాన్ని, వస్తువుల ధరలను అదుపులో పెట్టలేకపోవడంచేత, ద్రవ్యోల్బణ పరిస్థితి మరింత తీవ్రతరమై, సమాజం, ప్రజలు దెబ్బతిన్నారు.

ప్రస్తుత ఆర్థిక వ్యవస్థ, సమాజ వైఖరులు క్లిష్టంగా ఉన్నాయి. విలువ స్థిరంగా లేని డబ్బు ఎక్కువైతే దేశ సౌభాగ్యానికి దోహదం చేయదు. వస్తువు విలువను ద్రవ్యరూపంలో చెప్పితే దాని ధర అవుతుంది. నోట్ల చలామణీలో పెరుగుదలకన్న వేగంగా వస్తువుల ధరలు పెరిగినాయి. అధిక వ్యయాలు, సమ్మెలు, నగరాలలో జన సమ్మర్దం, ధర ఇంకా పెరుగుతా యని సరుకు అక్రమంగా నిలవచేయడం, ఆహార పదార్థాలు, అవసరవస్తువుల అంతర్రాష్ట్ర రవాణామీద నిర్బంధాలు మొదలైన కారణాలవల్ల ఉత్పత్తి అస్తవ్యస్తమై నిరుత్సాహకర మైన పరిస్థితి ఏర్పడింది. ద్రవ్యోల్బణం, పెరుగుతున్న ధరలు, సమాజానికి, సాధారణంగా ప్రమాద హేతువులు. అధ్యాపకులు, గుమాస్తాలు, వృత్తులవల్ల జీవనం చేసేవారు, పింఛను పుచ్చుకునేవారు, ఇదివరకటికన్న ఎక్కువ ఆదాయాలు పొందుతున్నప్పటికీ, వారి స్థిరాదాయాలకు, అధికధరలకు పొంతన కుదరక బాధ పడుతున్నారు. పెట్టుబడి పెట్టేవారు వారిపెట్టుబళ్ల మూలధన విలువ తగ్గిపోగా నష్టపడుతున్నారు. ప్రజల పొదుపులు దెబ్బతింటున్నాయి. కొన్ని వస్తువులమీద కంట్రోళ్ళు, ఇతర వస్తువుల ధరల పెరుగుదలకు కారణ మౌతున్నాయి. ముఖ్యావసరమైన వస్తువులు—బియ్యం, గోధుమలు, పంచదార, ఎరువుల—రేషనింగు క్రిందికి వచ్చినాయి. బీద ప్రజలు వారి కక్కరలేని కొన్ని వస్తువులను అక్రమంగా అమ్ముకుంటున్నారు.

బట్టలు, పాలు, సిమెంటు, కాగితం, కిరసనాయిల్, మందులు, టాయిలెట్ వస్తువుల ధరలు పెరగడంచేత సమాజం, యిక్కట్లు పడుతున్నది. మధ్య ఆదాయ వర్గాలకు చెందిన, చట్టానువర్తులైన పౌరులు వస్తువులలో కల్తీవల్ల, వస్తువుల సప్లై క్రమంగా లేక పోయినందువల్ల బాధపడుతున్నారు. సూపర్ బజారులలో (Super-bazar) రేషను షాపులలో ఉద్యోగులు ఋజు ప్రవర్తన తప్పుతున్నారు.

ఇది ఇట్లా ఉండగా, సమాజంలో మరికొంతమంది అధిక ధరలవల్ల బాగుపడుతున్నారు. అధిక డిమాండు (demand) ఉన్న వస్తువుల ఉత్పత్తిదారులు. ఇదివరకే తయారై సిద్ధంగా ఉన్న వస్తువుల నమ్మేవారు, ఉద్యోగాలు దొరుకుటవల్ల శ్రామికులు, ఋణగ్రస్తులు, భూస్వాములు, మార్కెట్టుకు ఉత్పత్తినంతా తీసుకురాని రైతులు, సంఘవ్యతిరేక చర్యలతో లాభము పొందుతారు.

వ్యాపారస్తులు నైతిక ప్రవర్తన అలవాటు చేసుకుంటే, అధికారులు నిజాయితీ పరులుగా, సమర్థులుగా ఉంటే, బ్లాక్ మార్కెటీర్లవంటి సంఘ విద్రోహక శక్తులను తీవ్రంగా శిక్షిస్తే, ప్రజలు ముఖ్యంగా అవసరంలేని ఖర్చులను (conspicuons consumption) తగ్గించుకుంటే; చాలావరకు ధరలు అదుపులోకి వస్తాయి.

అకస్మాత్తుగా కరెన్సీని తగ్గించడం అవివేకమైన పని. కాని, ప్రభుత్వము తన వ్యయాన్ని అదుపులో ఉంచుకుంటే, దిగుమతి, ఎక్సైజు సుంకాలను తగ్గిస్తే, స్వల్పకాలిక వ్యవసాయిక, పారిశ్రామిక ఉత్పత్తి పథకాలను ప్రోత్సహిస్తే, కరెన్సీ ఫ్రీజను (currency freeze) మితంగా అమలు పరిస్తే మంచిది. ప్రస్తుతము ఉన్న ద్రవ్యోల్బణ పరిస్థితి మారి, ప్రజలకు, ప్రభుత్వానికి ఎప్పుడు బాధోపశమనము కల్గిస్తుంది అనేది చెప్పడం కష్టం. సమాజంలోని అన్ని వర్గాల సహకారంతో, సహచర్యతో, పరిస్థితి మెరుగు అవుతుందని ఆశిద్దాము. (ఆకాశవాణిప్రసంగం సారాంశం.)

# ఒకే పక్షి

డా. సి. నారాయణరెడ్డి

ఒకే పక్షి
నిఖిల రోదసినిండా
వికసించిన దృక్పక్షి
ఒకే పక్షి.

ఎండను మేస్తుంది
వెన్నెలను తాగుతుంది
గాలిని కప్పుకుంటుంది
గగనంలో పడుకుంటుంది.

పయనముంది
లేదు విరతి
లయ ఉంది
లేదు యతి.

ఒకరెక్క కదిలిస్తే
ఉషస్సు
తతిమ్మా రెక్క విదిలిస్తే
తమస్సు.

విడిస్తే శ్రావణం
నవ్వితేనే శరన్మేఘం
కరిస్తే మాఘం
విరిస్తే మధురాగం.

ఆ పక్షి గరుత్తులు
అవనీ వియత్తులు
అది ఉద్వేలం
అది కాలం.



# చౌ ఎన్-లైతో చివరి ఇంటర్వ్యూ

## విలియం హింటన్

### అనువాదం — "హంస వివేక్"

'విప్లవ చైతన్యంతో దౌత్యాన్ని మేళవించి' ప్రపంచ చరిత్రలో చెరగని స్థానాన్ని పొందిన చౌఎన్-లై ఇటీవలే అస్తమించాడు. జన చైనా ప్రధానిగా నిరంతరంగా ఒక తరం పైగా తన దేశీయ-విదేశీయ- వ్యవహారాలను చౌ నైపుణ్యంతో — దక్షతతో నిర్వహించాడు. ఈనాడు నిక్సన్ నుంచి వాటికన్ వరకు ప్రతిఒక్కరు చౌ ను మహామేధావిగా— ప్రజానాయకుడిగా— జోహార్లు అర్పిస్తున్నారు.

మావో ఆలోచనావిధాన మనేది 'సర్వకాలీన సమగ్రమైన' సత్యంగా నమ్మి, యాంత్రికంగా అనుసరించవలసిందేనని వాదించే పిడివాదులకు ఈ ఇంటర్వ్యూలో చౌ చక్కని సమాధాన మిచ్చాడు. వ్యక్తిపూజ, కాలుష్యం, స్వయంసమృద్ధి తదితర అంశాలపై శాస్త్రీయ దృక్పథాన్ని వెల్లడించాడు.

గత వేసవికాలంలో విలియం హింటన్ (అమెరికన్ పత్రికా రచయిత) 'ఫాన్‌షెన్'రచయిత, చౌ తో ఈ ఇంటర్వ్యూ జరిపాడు. ఇది 'న్యూ చైనా' (అమెరికా), 'చైనా నౌ' (బ్రిటన్) అనే పత్రికల్లో ప్రచురించబడింది. 'ఫాన్‌షెన్' విముక్తి పేర తెలుగులో గత సంవత్సరం వెలువడింది. 'Iron Oxen', 'Hundred days War' అనేవి హింటన్ ఇతర గ్రంథాలు. ఇది ఇంటర్వ్యూను క్లుప్తీకరించి ఇస్తున్న అనువాదం మాత్రమే. —అనువాదకుడు.

హింటన్:— "నేను ఒక గొడుగును ధరించిన సాధువుని" అని మావో తనని తాను అభివర్ణించుకున్నాడా? ఈ మాటలు మార్మికంగా వున్నాయి.

చౌఎన్-లై:— 1970 డిసెంబర్ 18 న ఎడ్గార్ స్నో మావోను ఇంటర్వ్యూ చేసినపుడు పై అంశం బయటికి వచ్చింది. 1971 ఏప్రిల్ 30 'లైఫ్' పత్రికలో స్నో పై విషయాన్ని ప్రస్తావించాడు. అనేక వాస్తవ విషయాలను తెలియజేసిన స్నో కొన్ని చిన్న పొరపాట్లు చేసాడు. ఫలితంగా కొన్ని అపోహలు కలిగాయి. అలాంటివాటిలోనిదే పై అంశం.

'నేను గొడుగుకింద సాధువులాంటివాడిని'— ఫఫా — వుటిన్ (నాకు తలమీద వెంట్రుకలు లేవు— ఆకాశమూ లేదు) ఇది శ్లేషార్థం వున్న చమత్కారం. సాధువుతల నున్నగా వుంటుంది. తలపైన గొడుగు వుంటుంది కాబట్టి ఆకాశానికి అడ్డంవస్తుంది. కనుక అతని తలపై ఆకాశం లేదు. కాని చైనీస్ భాషలో 'ఫఫా' అంటే 'చట్టం' అని, 'వుటిన్' అంటే సర్వప్రపంచాన్ని పాలించే శక్తి అని అర్థాలు కూడా వున్నాయి. అంటే మనిషి చేసిన చట్టమైనా, దైవశాసనమైనా ఏదైనా సరే తనని బంధించలేవని మావో ఉద్దేశం. పాతుకపోయి ప్రతిబంధకాలుగా తయారైన ఏ వ్యవస్థనైనా— ఆచారాలైనా— నియమాలైనా, వాటిపై తిరుగుబాటు చేసితీరుతానని మావో చేసిన ప్రతిన అది.

శ్రామిక సాంస్కృతిక విప్లవం సాధించిన విజయాలను దృష్టిలో పెట్టుకుని మావో ఆ పైమాట అన్నాడు. పెట్టుబడిదారి పంథా తొక్కుతున్న వారికి విరుద్ధంగా ప్రజలను మేం సమీకరించాను. ప్రజలు వారిపై తిరుగుబాటు చేసారు. మావో ఆలోచనావిధానాన్ని ఆయుధంగా వాళ్ళ పొరపాట్లను నిర్దయంగా విమర్శించాడు. రాజకీయాలకే నిర్ణయాత్మకమైన పాత్ర అని ఆచరణలో చూపించాడు. ఇది సాంస్కృతిక విప్లవంలోని ప్రధానమైన, సృజనాత్మకమైన ధోరణి. అయితే ఈ సందర్భంగానే కొన్ని పెడ-ధోరణులు కూడా వ్యక్తమైనాయి.

ఒంటెద్దు ఆలోచనా ధోరణి. ఏకపక్షమైన అభిప్రాయాల వ్యక్తీకరణ ఈ పొరపాటు ధోరణులలో ఒకటి. దీనిని మావో తీవ్రంగా గర్హించి వ్యతిరేకించాడు. 'గొప్ప నాయకుడు' 'గొప్ప సర్వసేనాధిపతి' 'గొప్ప ఉపాధ్యాయుడు.' గొప్పసారథి'గా మావోని కీర్తించడం ఈ పొరబాటు ధోరణులలో ఒకటి. ఈ నినాదాన్ని చెన్‌పోటా ప్రతిపాదించాడు. పార్టీ కేంద్ర కమిటీలో సాంస్కృతిక విప్లవ దళానికి చెన్‌పోటా నాయకుడిగావుండేవాడు. 'కాని ఆ తర్వాత 1970 లో జరిగిన పార్టీ కేంద్ర కమిటి 9వ సమావేశంలో అతన్ని అన్ని పదవుల నుంచి తొలగించడం జరిగింది.

## చౌ ఎన్-లైతో చివరి ఇంటర్వ్యూ

తనని కేవలం గొప్ప ఉపాధ్యాయునిగా మాత్రమే వుండ నివ్వ వలసిందని, మిగతా గొప్ప సంకీర్తనలన్నీ మానివేయవలసిందని మావో కోరాడు. అయితే ఆ పని అంత సులభం కాలేదు. ఆ పరిణామం రావడానికి కొంతకాలం తీసుకుంటుంది.

అలాగే "మావో ఆలోచనా విధానం ఏకైక సంపూర్ణ ఆలోచనా విధానం"—"దీని అధికారాన్ని ప్రతిష్ఠించడమే ఏకైక కర్తవ్యం" అనే వివాదం కూడా పూర్తిగా తప్పు. అన్ని విషయాలకు వర్తించే ఏకైక సమగ్ర ఆలోచనా విధానం ఎలా వుండగలదు? కొన్ని సమస్యల పట్ల మావో అభిప్రాయాలు సమగ్రమైనవి— సాధికారమైనవి కావచ్చు. కాని ఆయనకు సంబంధించని రంగంపట్ల ఆయన అభిప్రాయాలు సాధికారం ఎలా కాగలవు? అంతేకాక పరిణామశీల మైన కాలాన్ని కూడా మనం పరిగణించాలి. ఈరోజు మన అభిప్రాయాలు సాధికారమైనవి–సరియైనవి కావచ్చు. కాని రేపు కాకపోవచ్చును. మావో ఆలోచనే సర్వస్వమూ అంతిమము అవుతే మరింత పురోగమనం ఎలా సాధ్యమవుతుంది? ఇలాంటి సిద్ధాంతం సామాజికమైన పురోగమనాన్ని స్తంభింప చేస్తుంది. చివరికి జడత్వాన్ని ఆవహింప చేస్తుంది.

ప్రజలే ఏ ఆలోచనా విధానమైనా సరియైనది కానిది ఆచరణలో–సంఘర్షణలో నిగ్గుతేల్చి చూపగలరు. ఒక ఆలోచనావిధానాన్ని దాని అధికారాన్ని స్థాపించాలనుకోడం ఏ కొద్దిమంది ద్వారానో ఎన్నటికీ సాధ్యంకాదు. ప్రజల పోరాట క్రమంలోనే అది సాధ్యమవుతుంది.

అంతేగాక సమౌచిత్యము. సందర్భం లేకుండా మావో ఫోటోలను, విగ్రహాలను ప్రదర్శించడం మరొక పొరబాటు ధోరణి. మావో ఈ వ్యక్తిపూజను, ప్రదర్శనను రోతపుట్టించే ధోరణి అని తరచుగా అంటారు. అయితే మహా నాయకుల పట్ల ప్రజల ఆదరాభిమానాలు అంత సులభంగాచెదిరిపోవు. ఉదాహరణకు స్టాలిన్, వాషింగ్టన్‌ల పట్ల ఆ దేశ ప్రజల గౌరవాన్ని చూడవచ్చు. ఫ్రెంచి విప్లవంలో రాబిస్పియర్ పాత్ర చాలా గొప్పది. అతన్ని ఉరితీయడం జరిగింది. కాని విప్లవంలో ఆతని పాత్రని చరిత్రలో ఎవరు విస్మరించలేరు.

హింటన్ :— 'జీవితంలో ప్రతిదీ సామాజికమైనదే– వ్యక్తిగతమైనదేదీ లేదు' అనే వివాదం కూడా ఏకపక్షమైనదిగానే వుంది. చాలా మంది ఈ అంశాన్ని ఒంటెత్తుపోకడతోనే అమలు చేస్తున్నారు. దీనికి మీ రేమంటారు ?

చౌ :— సామాజిక జీవితం, వ్యక్తిగత జీవితం అనేవి ఒకే-నాణానికి వుండే బొమ్మా-బొరుసు లాంటివి. వ్యక్తిలేకుండా సమాజం ఎలా వుండగలదు? చిన్నవస్తువులు లేకుండా పెద్ద వస్తువులు, పళ్లెం లేకుండా ఎత్తు వుండవు. అంతా సాంఘికమే వ్యక్తిగతమైనదే లేదు అనేభావం పూర్తిగా పొరబాటు.

మేము వ్యష్టి జీవితం లేదనము. కాని సమిష్టి జీవితానికి ప్రథమ స్థానం ఇవ్వాలని కోరుతాము. కొన్ని ప్రాథమిక విషయాల గురించి, ప్రధాన లక్ష్యాల గురించి కలసి పోరాడుదామని మనం నిశ్చయించుకోవచ్చు. అయితే ఆచరణలో ప్రతి విషయం గురించి మనకు వేరు—వేరు అభిప్రాయాలు కలగవచ్చు. అంటే మన ఐకమత్యం తాత్కాలికమైనది. భిన్నత్వం సుదీర్ఘమైనది. అయినప్పటికీ మనం పయనించే దిశ ఒక్కటే! వ్యక్తులు-వ్యక్తిగత జీవితాలు ఎప్పటికీ వుంటాయి. వ్యక్తులున్నప్పుడే సమిష్టి జీవితం సాధ్యమవుతుంది.

సమిష్టి తత్వం తప్ప వ్యక్తి చైతన్యం మాకు లేనేలేదని పెట్టుబడిదారులు మమ్మల్ని నిందిస్తారు. అయితే వ్యక్తిగత లాభం తప్ప సమిష్టి బాధ్యత లేనేలేదని నొక్కి చెప్పి వాళ్లే అతివాదుల్లా ప్రవర్తిస్తారు. ఈ ధోరణి ఉత్పత్తిలో గందరగోళాన్ని సృష్టిస్తుంది. ఉదాహరణకి వాతావరణ కాలుష్యం అనే సమస్యనే తీసుకుందాం. ఈ సమస్యకు పెట్టుబడిదారి వ్యవస్థలో పరిష్కారం లేదు. పెకింగ్‌కు నైరుతి దిశలో వున్న "తూర్పు ఎర్రబడింది" అనే రసాయన కర్మాగారాన్ని మీరు చూసే వుంటారు. ఈ కర్మాగారంలో ఒక యంత్రంలో నుంచి వచ్చే మిగులు కలుషిత పదార్థం మరో యంత్రంలో శుద్ధిచేయబడి పనికి వస్తుంది–తద్వారా కర్మాగారంలోంచి శుభ్రమైన నీరు మాత్రమే బయటికి వస్తుంది. ఆ నీటిలో చేపల పెంపకం-పంటలు పండించడం జరుగుతోంది.

అమెరికాలో పరిస్థితి దీనికి విరుద్ధంగా వుంది. కర్మాగారాల నుంచి వచ్చే అపరిశుభ్రమైన నీటివల్ల అక్కడ చేపలన్నీ చచ్చిపోతున్నాయి. అందువల్ల సముద్ర జలాల్లో చేపలు పట్టుకునే హక్కు కోసం పెరూ దేశంతో అమెరికా పోట్లాడుతున్నది. ఈ విధంగా పెట్టుబడిదారి దేశం తన సముద్ర తీరాలను కలుషితం చేసుకోవడమే కాకుండా ఇతరుల సంపదను కాజెయ్యాలని ప్రయత్నిస్తుంది.

జపాన్‌కూడా 'కాలుష్యం'సమస్యను తీవ్రంగానే ఎదుర్కొంటూ వుంది. అయితే తమ వ్యవస్థలో దీన్ని పరిష్కరించే మార్గం లేదని జపానీస్ అధికార్లు ఒప్పుకుంటున్నారు. యొకోహామాలో పరిస్థితి మరింత అధ్వాన్నంగా వుంది. సముద్ర తీరం దరిదాపుల్లోని చేపలన్నీ

చచ్చిపోయాయి. చమురుశుద్ధి కర్మాగారాలే దీనికి కారణం. వ్యక్తి వాదాన్ని హద్దుమీరి పెరగనిస్తే వ్యక్తులు పరస్పరం చంపుకునే ప్రయత్నం మొదలవుతుంది. పెట్టుబడిదారీ విధానం కాలుష్యానికి దారి తీస్తుంది.

వ్యక్తికి-సంఘానికి మధ్య సరియైన సంబంధం కోసం మా సోషలిజం కృషిచేస్తుంది. సామాజిక స్పృహ తప్ప వ్యక్తిస్పృహ అనేదే లేకుండా సోషలిజం పరిస్థితులను ఏనాటికి మార్చలేదు. వ్యక్తిగత మైన కోరికలను సామాజిక అవసరాల కోసం వదులుకునేంత వరకు ప్రజలు ఎదగడమే మా ధ్యేయం. సమూహాన్ని-వ్యక్తిని సమ న్వయపరచడమే మా లక్ష్యం.

దీనికి ఉదాహరణగా తకాయి దళం (సమిష్టి వ్యవసాయ క్షేత్రం యొక్క నమూనా) అనుసరిస్తున్న విధానాన్ని చూడవచ్చు. అక్కడ సామాజిక క్రమశిక్షణ వున్నప్పటికీ వ్యక్తిగతమైన వైవిధ్యం తప్పనిసరిగావుంది. అయితే మొదలు మరో అనుభవంగురించి చెబుతాను. లాంగ్‌మార్చ్ కాలంలో మేం ఉత్తరాదిన ఉన్నాము. దక్షిణం నుంచి వచ్చిన సైనికులకు సజ్జలు-జొన్నలు అలవాటులేదు. మేం వాటితో బాటు ఖర్జూరంకూడా వండేవాళ్లం - క్రమంగా వాళ్లు వాటికి తర్వాత అలవాటుపడ్డారు. ఉత్తర ప్రావిన్స్ ప్రజలు కోడిని లేదా పందిని చంపినపుడు లోపలిభాగాన్ని తినరు - పారవేస్తారు. కాని దక్షిణాది వాళ్లు వాటిని ఇష్టంగా తింటారు. కనుక మేం వాటిని ఆదా చేసి-దక్షిణాదివాళ్ళకోసం వండేవాళ్లం. ఆ విధంగా ఎవరి అలవాట్లనైనా అకస్మాత్తుగా మార్చలేము.

ఇక 'సమిష్టి జీవితానికి ప్రథమస్థానం, వ్యక్తి జీవితానికి రెండోస్థానం' అనే నినాదానికి తకాయి దళం (వ్యవసాయ క్షేత్రం) సజీవ తార్కాణం. పంట రాగానే ప్రభుత్వానికి పన్నుగా ఇవ్వవలసిన ధాన్యాన్ని ప్రభుత్వానికి అమ్మవలసిన ధాన్యాన్ని విడిగా పెడతారు. తరువాత రాబోయే పంటకి కావలసిన విత్తనాలు వేరే తీస్తారు. ధాన్యం అమ్మగా వచ్చిన డబ్బులోంచి వచ్చే సంవత్సరానికి కావలసిన పెట్టుబడి, ఇళ్ల నిర్మాణానికి కావలసిన సొమ్ము వేరుగా పెడతారు. కరువులు-వరదలు వస్తే ఎదుర్కోడానికి కొంత ధాన్యాన్ని విడిగా భద్ర పరుస్తారు. ఆ తర్వాత మిగిలిన ధాన్యాన్ని తలసరి వాటాలుగా పంచుకుంటారు. ఆ వాటాలే వ్యక్తిగత ఆదాయం. అయితే ఈ ఆదాయం ప్రతిసంవత్సరం సమానంగా పెరిగినపుడే ప్రజలకు ఉత్పత్తి పట్ల ఉత్సాహం, శ్రద్ధ పెరుగుతాయి.

హింటన్:—స్వయంసమృద్ధి గురించి చెప్పండి, అది ఎంతవరకు మీకు సాధ్యమైంది?

చౌ :— తకాయి దళం స్వయంసమృద్ధి అనే సూత్రాన్ని ప్రధానంగా ఆచరణలో చూపింది. అయితే అన్నిచోట్లా ఇది సాధ్యం కాలేదు. ప్రకృతి వైపరీత్యాలు తదితర కారణాల వల్ల ఇది కుదరకపోవచ్చు. స్వయంసమృద్ధి ఒక ముఖ్య లక్షణం. అంతే తప్ప అది సంపూర్ణంగా సర్వత్ర సాధ్యంకాకపోవచ్చు.

మనం ఒక మార్గాన్ని నిర్దేశించాలి. తకాయి లాంటి ఒక పటిష్ఠమైన సజీవ నమూనాను స్థాపించాలి, ఆ నమూనా చాలా మంది ప్రజలకు అనుసరణసాధ్యంగా వుండాలి. వాళ్లు అందుకోలేని ఆదర్శమైతే అది ఎంత మంచి ఆదర్శమైనా వృథాయే! ప్రజలు ఆచరణలో అందుకోగల నమూనా వున్నప్పటికి దాని గురించి ప్రజల్లో విస్తృతంగా ప్రచారం జరగాలి. దాని గురించి అధ్యయనాన్ని ప్రజల్లో ప్రోత్సహించాలి. ప్రచార సందర్భంగా ఆవసరమైనంత వెసులుబాటు తత్వం చూపించాలి. వివిధ ఆచారాల్ని పరిస్థితుల్ని దృష్టిలో వుంచుకొని ప్రచారం సాగించాలి. ఒక మార్గాన్ని నిర్దేశించినపుడు — దాని ఆచరణకి అవసర మైన భౌతిక పరిస్థితులను ఎవరికి వారు నిర్ణయించుకోవాలి. అంతే తప్ప దేనినీ యాంత్రికంగా అధ్యయనం చేయ కూడదు.

'మొదట సామాజిక అవసరాలు' — 'ఆ పిదప వ్యక్తిగత అవసరాలు' ఆచరణలో చూసుకొంటూ 'స్వయంసమృద్ధి ప్రధానలక్ష్యం'గా చేరుకోగలగాలి.

సమగ్రమైన-సంపూర్ణమైన నమూనా లేదా ఉదాహరణ అనేది ఎక్కడా వుండదు. 'అక్కడ ప్రతిదీ బాగానేవుంది' అని అనిపించుకోగల స్థలం ఎక్కడా వుండదు.

---

# బుక్ ప్రింటింగ్ ఇన్ ఇండియా

# BOOK PRINTING IN INDIA

**With Special Reference to the Contribution of European Scholars to Telugu 1746-1857.**

**Bangore Books, Nellore (S. India) Price: Rs. 60/-**

భారత దేశమున సంస్కృతభాషలోను, దేశ భాషలలోను గ్రంథ ముద్రణము పాశ్చాత్యుల మూలమున ప్రారంభమైనది. భాషా చరిత్ర, వాఙ్మయ చరిత్ర, లిపిచరిత్ర—వీనితోబాటు గ్రంథముద్రణ చరిత్ర మనము తెలిసికొనుట యావశ్యకమే.

పై గ్రంథము భారతదేశమున గ్రంథముద్రణము గూర్చి—ప్రత్యేకముగా 1746నుండి 1857 వఱకు—తెలుగు ముద్రణమునకు పాశ్చాత్యుల సేవనుగూర్చి తెలుపునది. 320 పుటలుగల ఈ ఆంగ్ల గ్రంథమునకు రచయిత డాక్టరు మంగమ్మ. ప్రచురణ కర్త బంగోరె. పరిచయకర్త— జి. యన్. రెడ్డి.

ఇందు 1746 నుండి 1859 వఱకు తెలుగులో ముద్రితమైన గ్రంథములను గూర్చిన వివరములు గలవు—తెలుగు ముద్రణకు, భాషకు సేవచేసిన పాశ్చాత్యుల సంగ్రహజీవితము లిందున్నవి. తెలుగు ముద్రణకు సంబంధించిన 28 ఛాయా చిత్రము లిందుండుట విశేషము—వానిలో తెలుగులో ప్రథమముగా ముద్రింపబడిన పుస్తకముల ముఖపత్రములున్నవి. ఇతరములును గలవు. వానిలో "జాన్ ఫ్రెయరు" అను పాశ్చాత్యుడు 1698లో మొదటిసారిగా తెలుగులిపి వాడినాడు"— అని చూపు చిత్రము (2) మిక్కిలి ప్రశంసింప దగినది.

ఇందు ఆరు అధ్యాయములు. ఆరు అనుబంధములు గలవు.

## అధ్యాయముల వివరణ



## అ ను బ ం ధ ము లు

## అధ్యాయ వివరణ

### 1

ఇందు ఖండాంతరమున, భారతదేశమున ముద్రణ ప్రారంభమును గూర్చి తెలుపబడుటయేగాక 1453–55 సంవత్సరములలో తొలిసారిగా ముద్రింపబడిన బైబిలు పుట ఛాయాచిత్రము నీయబడి యున్నది.

### 2

తెలుగులో 1746–47లో మొట్టమొదట ముద్రింపబడిన ఆరు గ్రంథములు వివరణ–'షూల్జి' అను క్రైస్తవ మతాచార్యుని తెలుగు ముద్రణసేవ–శ్రీరామపురము (**Serampore-Bengal**) క్రైస్తవ మతాచార్యులు ప్రచురించిన గ్రంథములు. బళ్లారి క్రైస్తవ సంఘమువారు 1835–38లో ప్రకటించిన చిన్న మత పుస్తకములు నిందు గలవు.

### 3

కుంపిణీ ప్రభుత్వమువారిచే స్థాపితమైన కళాశాలలు. కలకత్తాలో ఫోర్టు విలియము కళాశాల, మదరాసులో ఫోర్టు సెంటుజార్జి కళాశాల–దేశభాషలలో గ్రంథ ముద్రణమునకు చేసిన సహాయము ముద్రించిన గ్రంథముల వివరణ యిందు గలదు.

## నిఘంటువులు

### 4

ఇందు పాశ్చాత్యులు వ్రాసిన ఇంగ్లీషు–తెలుగు నిఘంటువులు విలియము బ్రౌను (1818) కాంబెలు (1821) మారిసు (1835) అనునవి పేర్కొనబడినవి.

బ్రౌనుదొర-తెలుగు–ఇంగ్లీషు నిఘంటువు (1852)ను గూర్చి వివరణ గలదు. ఆతని మిశ్ర భాషా నిఘంటువు పేర్కొనబడినది. ఆయన జిల్లానిఘంటువు వివరములు గలవు.

మొదట తెలుగు భాషలో అకారాది నిఘంటువు మామిడి వెంకయ్య 'ఆంధ్రదీపిక' (1813) సమగ్ర చరిత్ర యిందు గలదు

### 5

## వ్యాకరణములు

ఇంగ్లీషు భాషలో పాశ్చాత్యులు వ్రాసిన తెలుగు వ్యాకరణములు–కారీ (1814) కాంబెలు (1816) విలియము బ్రౌను (1817) బ్రౌను దొర (1840) పేర్కొనబడినవి.

తెలుగు వ్యాకరణములో–రావిపాటి గురుమూర్తి శాస్త్రి వ్యాకరణము (1836) చిన్నయసూరి శబ్దలక్షణ సంగ్రహము (1853) ఉదయగిరి శేషయ తెలుగు వ్యాకరణ సంగ్రహము (1857) ఆళ్వారు దాసు ఆంధ్ర వ్యాకరణ చంద్రిక (1859) గలవు. వీనితోబాటు 1856 లో ముద్రితమైన - త్యాగరాజ మొదలి ఛందో రత్నాకరము – 1859 లో ముద్రితమైన కాకునూరి అప్పకవి అప్పకవీయము కలవు.

### 6

## ఇతర ముద్రిత గ్రంథములు

ఇది యీ గ్రంథమున కంతకు ముఖ్యాధ్యాయము.ఇందు పెక్కు గ్రంథము లుదాహరింపబడినవి. అవి 1) రావిపాటి గురుమూర్తి శాస్త్రి విక్రమార్కుని కథలు (1819) 2) పంచతంత్ర కథలు (1834) 3) బ్రౌను వేమన పద్యములు (1827) 4) మూలికా సంకలితము (1835) 5) పాకశాస్త్రము (1836) 6) అరేబియన్ నైట్సు కథలు (1840) 7) ఆత్మబోధ ప్రకాశిక (1840) 8) సంభాషణలు (1840) 9) నంచరిత్ర దీపిక (1841) 10) హరిశ్చంద్ర చరిత్ర–నలనాథ చరిత్ర (1842) 11) దాశరథి శతకము (1842) 12) తెలుగు పాఠ్యపుస్తకము (1851) 13) జాన్ ప్రేయర్ తానిసు బూపాలీయము (వ్యవహారదర్పణము) (1851) 14) మనుచరిత్ర (1852) 15) బ్రౌను తెలుగు పాఠములు (1852) 16) వీరరాఘవ శతకము (1852) 17) అంబుజాక్ష శతకము (1852) 18) నీతిచంద్రిక (1853) 19) విష్ణుపురాణము (1855) 20) ఇసుపకమ్మి త్రోవలు (1856) 21) మెరుపు టపా (1856) 22) ఇంగ్లండు దేశ చరిత్ర (1856) 23) నీతికథలు చిత్రకథలు (1856) 24) బాలశిక్ష (1856) 25) చదివే రెండోపుస్తకము (1857) 26) అమెరికాను కనుపెట్టిన చరిత్రము (1857) 27) నర

హర్యక్ష శతకము (1857) 28) వెంకటాచల మహాత్మ్యము (1858) 29) వరాహ పురాణము (1858) 30) కలిరా మణూచికము (1858) 31) హిందూధర్మ శాస్త్ర సంగ్రహము (1858) 32) గణితశాస్త్రము (1858) 33) పుల్మనీ కరుణులకథ (1858) 34) దేవచిత్తం సజ్జన భాగ్యం (1859) 35) భూగోళ సంగ్రహము (1859) 36) కూరత్తాళ్వారు చరిత్ర (1859) 37) ద్వాదశమంజరికా చతుర్దశ మంజరికా (1859) 38) ఇలియటు ప్లొరా ఆంధ్రికా (1859) 39) అప్ప కవీయము (1859) 40) చంద్రశేఖర శతకము (1859) 41) వేమన సుమతి శతక పద్యములు (1859) గాన శాస్త్రము (1859) 42) సారంగధర చరిత్రము (1859) 43) శృంగార నైషధ కావ్యము (1‿59) 44) సుబ్రహ్మణ్య విజయము (1859) 45) స్కాంద పురాణము (1859) 46) యాజ్ఞ వల్క్యస్మృతి (1850–60)

పుట. 211. బ్రౌనుదొర 1842 లో ముద్రించిన గ్రంథములు. 1. వసుచరిత్ర 2. మనుచరిత్ర 3. కుచేలో పాఖ్యానము 4. సప్తమ స్కంధము 5. హరి శ్చంద్ర ద్విపద 6. వలి ద్విపద 7. శతకములు— వేమన, సుమతి, భాస్కర, కాళహస్తి, కోదండరామ, భళిర కరివేల్పు, లావణ్యసీమ మొ. 8. అమర కోశము టీక 9. ఆంధ్ర వ్యాకరణము.

ఆదేపుట – వర్తమాన తరంగిణి పత్రిక (1842)–ముద్రించిన గ్రంథములు. 1. ఆంధ్రనామ సంగ్రహము–టీక 2.హరిశ్చంద్రోపాఖ్యానము(యక్షగానము) 3. రుక్మిణీ కళ్యాణము 4. ప్రహ్లాద చరిత్ర, భగవద్గీత 5. బాల శిక్ష; భజగోవింద శ్లోకములు 6. కవిజనరంజకము శుకరంభాసంవాదము 7. రంభా రావణ సంవాదము 8. గజేంద్ర మోక్షణము 9. రామతారక శతకము 10. కాళహస్తి శతకము 11. దాశరథీశతకము.

ఈ యధ్యాయమున ముద్రిత గ్రంథములు కాలక్రమమున కూర్చబడినవి–అవి పరిగాలేవు–పద్యములు; వచనములు–అని గ్రంథ వర్గీకరణముకూడ లేకపోవుటవలన–చదువరులకు చాల క్లేశము గలి గించుచున్నది.

ఇందిన్ని గ్రంథము లీయబడినను ఇంకా యీకాలమునకు అనగా–1859 కి పూర్వము అచ్చుపడిన గ్రంథములు చాలా ఉన్నవి– వానిని వేఱుగా చూపుచున్నాను.

# అనుబంధములు

వీనిలో 5 వది – వార్తాపత్రికలు – సంచికలు అనునది గ్రంథములో మండవలెను. అది సాహిత్యమునకు సంబంధించినది. 6 వది అనుబంధముక్రిందనే యుండదగినది. మిగిలినవాని విమర్శ.

## 1. జెంటూ–తెలుగుభాష

జెంటూ పదప్రయోగము తెలుగున 1822 నాటికే అంత రించినది–బ్రౌను – "It is high time to abolish the absurd name Gentoo," which was introduced by the portugease and is ignoransly used by some persons for the name Telugu" అని తన యభిప్రాయము తెలిపినాడు (Dictionary of mined Telugu 1852) ఇది ఒక పుటలో సంగ్రహింప దగినది.

## 2. కాలినుమెకంజీ సాహిత్యసేవ

మెకంజీ చేసిన సేవ చరిత్రకేగాని సాహిత్యమునకుగాదు. ఆయన సేకరించిన చారిత్రక సాధన సంపుటము లన్నియు వ్రాత ప్రతులే–ముద్రణ కళతో నాతనికి సంబంధము లేదు–అవి అందఱికి పరిచితములే.

1 మద్రాసు విశ్వవిద్యాలయమువారు (1934–50) 176 సంపుటముల నాంగ్లభాషలోని కనువదింపజేసి యున్నారు.

2 మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమువారు Mackenzie Manuscripts అను పేర మూడు సంపుట ములు ప్రకటించినారు.

3 ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడమీవారు మెకంజీ 181 సంపు టములకు ప్రతులు వ్రాయించినారు. అవి అందఱికి అందు బాటులో నున్నవి.

## 3. కావలి సోదరులు

కావలి సోదరులు చిరకాలముగా తెలుగువారికి పరిచితులు.

1893 – గురుజాడ శ్రీరామమూర్తిగారు తమ కవిజీవితములలో దక్కను కవుల చరిత్ర మదాహరించినారు. (రామరాజ భూషణుడు)

1895 వీరేశ లింగముగారు ఆంధ్రకవుల చరిత్రలో కావలి రామ స్వామి దక్కనను కవుల చరిత్ర మదాహరించినారు. (తెనాలి రామలింగకవి)

1923 – కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు ఆంధ్రపరిశోధక మండలి సంచమ వార్షికాధ్యక్షోపన్యాసమున–కావలి వెంకట బొర్రయ్యను గూర్చి తెలిపినారు.

1948 - కావలి వెంకట బొర్రయ్య జీవితము 'తెలిఙ్గ' పత్రికలో ముద్రితమైనది.

1962 — Poineers of English wising in India The Cavally Telugu family అను నా వ్యాసము—Anuals of Oriental Re-sereh Madras University Vol. XIX- 1962)లో ప్రకటితమైనది - అందు కావలి సోదరులను గురించిన సంపూర్ణ వివరము లున్నవి.

పై 2,3—అనుబంధములు — గ్రంథమున కెంతమాత్రము సంబంధించనివి - అనావశ్యకములు.

## గ్రంథమౌలికత

ఇంతవఱకు గ్రంథమునగల విషయములను తెలిపితిని. ఇక ఈ గ్రంథమునకు మౌలికత (Originality) ఎంత యున్నదో నిరూపించుచున్నాను.

## తెలుగు ప్రాత అచ్చు పుస్తకములు - పరిశోధన

డాక్టరు మంగమ్మగారు "A word at the Beginning" అను తమ ముందుమాటలో నిట్లు వ్రాసినారు. "scholars shoud be cautions about tbe source materil they cheseas their own works become sources for the future generations. (పుట XII) "పరిశోధన గ్రంథమును రచించు విద్వాంసులు తమ గ్రంథమునకు మూలమైన విషయ సేకరణము గావించినపుడు జాగరూకత వహింపవలెను. ఏలననగా తమ గ్రంథములే, తర్వాతి తరమువారి కాధారము లగును."

పై వాక్యమునం దొక భావము గర్భితమై యున్నది.

"తెలుగుముద్రణ చరిత్రగూర్చి ఇదివరకు పరిశోధన జరుగలేదు. నేను ఆ పరిశోధనకు మూలములైన సాధనములను తొలిసారిగా పరిశీలించి దీనిని వ్రాసితిని. ఇది తరువాతివారి కందఱకు ఆధారమగును."

దీని ననుసరించియే ప్రచురణకర్తలైన బంగోరెగారు Why I publish this work. (నేనీ గ్రంథము నెందుకు ప్రకటించితిని) అనుదానిలో నిట్లు వ్రాసినారు.

Dr, Margammas work is a poineering one in the field. ఈ పరిశోధనలో డాక్టరు మంగమ్మగారి గ్రంథము ప్రథమ ప్రవర్తకము.)

ఈ గ్రంథ రచయితలు, తమ గ్రంథమున పూర్వ తెలుగు ముద్రణములను గూర్చి గ్రంథములేవియు పేర్కొనక పోవుటవలన ప్రచురణకర్తలును పై యభిప్రాయమును ప్రకటించిరి – కాని

ఈ గ్రంథమున నింతకుముం దేలోకములో వెల్లడియైన విషయములే యున్నవిగాని క్రొత్త విషయ మొక్కటియులేదు. దీనిని నిరూపించుచున్నాను.

ఇప్పటికి నలుబదిమూడేండ్ల క్రిందట అనగా 1933 నుండి ప్రాత అచ్చు పుస్తకములను గూర్చి పరిశ్రమ జరుగుచునే యున్నది. గ్రంథములు ప్రకటింప బడినవి.

## గద్యచింతామణి

అభినవ వాగనుశాసన గిడుగు వెంకటరామమూర్తి పంతులు గారిది. సప్తతి మహోత్సవ ప్రచురణము 1933.

## ఆంధ్రవచన వాఙ్మయము

ప్రస్తుత సమీక్షా కర్త రచనము—1951లో—ఆంధ్రగ్రంథమాలా సంపాదకులు కీ. శే. శంభుప్రసాదుగారు ప్రకటించినది. సాహిత్య లోకమునకు పరిశోధకులకు పరిచితమైనదే. అయినను

ప్రచురణకర్తలైన బంగోరెగారి దృష్టిలో పై గ్రంథములు పరిశోధనా ప్రామాణిక గ్రంథములుగా లేవు. 'పనికిమాలినవి.'

ప్రస్తుత గ్రంథములోని విషయములు. ఇప్పటికి పాతికేండ్ల క్రిందటనే—పై ఆంధ్రవచన వాఙ్మయమున గద్యచింతామణిలోను అచ్చై కూర్చున్నవి. వానిని తొలుత చూపుచున్నాను.

### నా ఆంధ్రవచన వాఙ్మయము 1951

I

పుట 70

1. సత్యమైన వేదంలో వుండె జ్ఞాన ఉపదేశాలయొక్క సంక్షేపం. (1746)

2. మోక్షానికి కొంచ్చుపొయ్యేదోవ (1746)
3. బుద్ధి కలిగిన నూరు జ్ఞాన వచనాలయొక్క చిన్న పుస్తకము (1747)
4. ఒక గురువు అఙదు బ్రాహ్మలయొక్క......పెద్దస్వామి మీద ప్రసంగించిన తరక మితె (1747)

* * *

## డా. మంగమ్మగారి ప్రస్తుత గ్రంథము 1975

పుట 34

(7) సత్యమైన వేదంలో వుండె. (తరవాత లేదు.)

(6) మోక్షానికి కొంచ్చుపోయే దోవ

(8) బుద్ధి కలిగిన నూరు జ్ఞాన వచనాల. (తరవాతలేదు.)

(9) వక గురువు అఙదు బ్రాహ్మలయొక్క వడమాన (ఇందు వీని ముఖపత్ర ఛాయాచిత్రములున్నవి.)

# II

పుట 70

దేవునియొక్క సమస్తమైన వాక్యము సవిశేషము మమ్మును రక్షింవ్వె కర్త అయిన ఏసుక్రీస్తుయొక్క శుభ సమాచారము (మార్కుమత్తయి లూకా సువార్తలు)గ్రీకుభాషనుండి జిక్రాన్ ఆనందరాయర్‌గార్ల సహాయముతో ఎ. డి. గ్రాంజెస్‌గారు అనువాదించినది. శ్రీరామపురములో 1812.

* * *

**Page : 61**

**The translation in Telugu of Matthew, Mark and Luka along with a few facts prepared by Desgranges with the help of George Crane and Ananda Rayer were printed at the Serampore Press in 1812.**

# III

పుట 70–71

యీ గ్రంథము యేసుక్రీస్తుయొక్క నూతన నిర్ణయమై యున్నది.

ఏసుప్రభువు, రక్షకుని నూతన నిబంధన గ్రీకుభాషనుండి ఆనందరాయరుగారి సహాయముతో ఎడ్వర్డు ప్రిచ్చెట్‌గారిచే తెలుగులోకి అనువదింపబడినవి. 2 వాల్యుములు—1818,

* * *

**Page : 61**

**The Second version of the New Testament translated from the original Greek into Telugu by Prichett was printed at the Madras Commercial Press.**

**This was in tow Volumes.**

# IV

పుట 72

ఈశ్వరుని అన్నిమాటలు విశేషముగా మనుష్యుని ఉద్ధారము కొరకు ఆదరించేటందుకొరకున్ను చెని ప్రకాశముచె నున్నాడో ఇదె ధర్మ పుస్తకము దాని అంత్యభాగము అర్థము మాకు ప్రభుడు ఉద్ధరించేవాడునైన యెశు క్రీష్టుని మంగళ సమాచారములు.

గ్రీక్ భాషవల్లనుండి తర్జుమాయెను.

శ్రీరామపురములోపడెచ్చు ఆయను— 960 పుటలు 1818

* * *

**Page : 66**

ఈశ్వరుని అన్నిమాటలు...ఇదె ధర్మ పుస్తకము (**Esveruni anni matalu of 960 pages) prepared by carey was printed at the sreiampore mission press in 1818.**

# V

పుట 74

## కథా వాఙ్మయము

ఈ వాఙ్మయమున తొలుత పేర్కొన దగినవి.

1. విక్రమార్కుని కథలు 1819.
2. పంచతంత్ర కథలు 1834.

ఇవి రెండును ఫోర్టుసెంటుజార్జి కళాశాలలో నాంధ్ర ప్రధానోపాధ్యాయుడగు రావిపాటి గురుమూర్తి శాస్త్రి గారిచే (1770-1837) రచితమైనది. తెనుగువారిచే రచితమై ముద్రితమైన గ్రంథములలో మొదటిది విక్రమార్కుని కథలు. ఇది 1819, 1828, 1850, 1858లో నాలుగుసారులు ముద్రితమైనది. పంచతంత్రము 1834, 1848,

1869. 1869లో నాలుగుసారులు ముద్రితమైనది. ఈ ముద్రణములనుబట్టియే వీని కాలమునగల వ్యాప్తిని తెలుసుకొనవచ్చును.

చిన్నయసూరి రాజధానికళాశాలలో పండితుడుగా నున్నప్పుడు మొదట కొన్నియేండ్లు పై గ్రంథములనే పాఠములుగా చెప్పినాడు.

* * *

**Page : 109**

Tales of Vikramarka by one of the Teachers in the college Ravipati Gurumurthy a text of 104 pages issued from the College Press in 1819.

**Page : 198**

One such early work put to print by them was that of Ravipati Gurumurthy Sastri who adopted into Telugu the tales of Vikramarka known as Dwatrinst of Salabhangikala kathalu and this book of 104 pages come out in 1819 from the College Press. The second edition came out with 113 pages in 1828 while the third of 116 pages in 1850 All the three are in the British Museum.

దీని ప్రకరణ–111, 200-1, 207–213 లో గలదు.

Another work of Ravipati Gurumurthy Sastri is the Panchatantra Kathalu of 136 pages printed at Madrass in 1834. The second edition of 124 pages was printed in 1848

# VI

పుట 100

అయోమార్గములు తంత్రీవార్తలు వీనిని గూర్చి పుస్తకములు వ్రాయించిరి. వీని కాలమున Railways అనగా ఇనుప కమ్మి త్రోవలు అని మెరుపుటప్పా అనగా Tale grophs అని ఈ పేర్లతోనే 1856 సంవత్సరము పుస్తకములు ప్రకటింపబడినవి.

* * *

**Page : 221**

Railway Steam Engine ఇనుకమ్మి తోవలు and the Electric Telegraph tappal మెరుపు టప్పా of 18 pages and and 3 plates thesewere printed in the London Mission Press Vizagapatam in 1856.

# VII

పుట 100

అమెరికాను కనిపెట్టిన చరిత్ర .1857

* * *

**Page : 221**

History of the discovery of America – అమెరికాను కనిపెట్టిన చరిత్రము ... ... ...

The second edition with P P VI + 70 came from Madras in 1857,

# VIII

పుట 116

హిందూధర్మశాస్త్ర సంగ్రహము క్రీ. శ. 1858

ప్రఖ్యాత పండితుడగు పరవస్తు చిన్నయసూరి కర్న్యాలు నరహరి గోపాలకృష్ణమ సెట్టిగారి పర్యవేక్షణక్రింద ఏ రాజకీయ శాస్త్రగ్రంథమును ఆంగ్లేయ భాషనుండి యను వదించెను.

చిన్నయసూరి పై గ్రంథమును నేను 1962లో తిరిగి ముద్రించి యున్నాను.

* * *

**Page : 224**

Thomas Lumsdeni Mannual of Hindu Law was translated as Hindu Dharmasastra Sangraham by Chinnayasoori, assisted by Narahari Gopala Krishnama Chetty and was printed in 1858 at Madras.

# I

## గద్యచింతామణి

పుట 241

బడిపిల్లల పుస్తకములు |

### i పెద్దబాలశిక్ష

ఇది ఇంచుమించుగా 90 సంవత్సరముల క్రిందట పుదూరి సీతారామశాస్త్రిగారు చిన్నపిల్లలకు లోకవ్యవహారానుసారముగా

తెలుగు నేర్పుటకుగాను రచించినారు.

241-242 పుటలో దీనినుండి ఉదాహరణలు కలవు.

* * *

Page : 221.

Balasiksha The most popular Reader of the times was prepared by Puduri Sitarama Sastry, It has lessons in spelling literory composition, prosody Sanskrit Hyms geography History small stories o Morals Arthematic and other things.

## ii

పుట 255

చిన్నవాండ్లకు తెలివి పుట్టగలందులకున్ను నడవడి తెలియగలందులకున్ను యేర్పరచబడ్డ వేడుక కథలు కలవు

(A reprint from the Madras school Book society.)

* * *

Page : 275

1st. Pleasing Tales

A reprint of the Calcutta edition with a translation in Telugu the original English.

(Appendex IV. School Book Society.

## iii

పుట 261

ఇంగ్లాండు దేశ చరిత్ర ఇందుండి "అన విధియము" అను నాతని గూర్చినది 2 పుటలు గలవు.

* * *

Page : 217

Out lines of the History of Englgnd was printed by the S P C. K. Press in Vepery in 1856 The book is of 214 pages.

## iv

పుట 273

### శబ్దమంజరి

సీతామంగళం మునిపల్లె విశ్వంభరశాస్త్రి-1. అహోబలాచార్యులు 2. ముద్దురామశాస్త్రి 3. భీమసేనాచార్యులు

4. గురుమూర్తిశాస్త్రి-వీరిచే విచ్చిన యోగ్యతాపత్రము కాలేజి సెకటరియైన మహారాజశ్రీ హెన్రిహార్కినెసు దొర గారికి వ్రాసినది.

* * *

Page ; 184

A Sanskrit Primer or first book of series........ by Captain Henry H . knens and Viswambhara Sastri A certificate of the work signed by Ahobalacharyulu Muddu Ramasastri Bhimasenacharylu and Guru murthy Sastri.

## V

పుట 286

జాన్ ఫ్రెయరా మను భూపాలీయ మనే వ్యవహార దర్పణము లోని దాయభాగఖండములో నొకభాగ ముదహరింపబడినది. ఇవి రెండు పుటలు

* * *

Page : 215

There is one book on administration John Fryie Thomas Bhupaliyam or Vyavahara darpanamu.

దీని ప్రథమ (1851) ముద్రణ ఛాయా చిత్ర మిందు గలదు. (Plate 28)

పై రెండు గ్రంథములే గాక మరి రెండు గ్రంథము లీ తెలుగు ముద్రణ చరిత్రకు సంబంధించినవి గలవు.

1. తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము-1956
2. సి. పి. బ్రౌన్-1963-280 పుటలు.

రెండింటికి కర్త డాక్టరు కొత్తపల్లి వీరభద్రరావు-

ఈ రెండింటివలన-నేను పైని చూపినవిగాక-ఈ గ్రంథమందలి తక్కిన విషయములు లోకమునకు తెలిసిపోయినవి. మొదటి గ్రంథము మొదటినుండి 220 పుటలు రెండవ గ్రంథము పూర్తిగా-వాని నింతకుముందే తెలిపినవి. వ్యాస విస్తర భీతిచే వానినియటలేదు—ఇందువలన నీ గ్రంథ మమౌలికమని సారాంశము.

ఇందింకను సవరింపవలసిన యంశము లున్నవి.

# ఈ గ్రంథమున విడిచిన పూర్వముద్రణ పుస్తకములు

## పద్య కావ్యములు

| | | | |
|---|---|---|---|
| 1 | భారతము – ఆదిపర్వము | 1847 | (తెలుగు కవుల చరిత్ర పుట. 154) |
| 2 | ,, 18 పర్వములు | 1853 | (సంశోధితమహాభారతము) (ఉస్మానియా విశ్వవిద్యాలయము) |
| 3 | ,, ,, | 1853 | ( ,, ) |
| 4 | భాగవతము 10, 11, 12 స్కంధములు | 1843 | బాలకవి శరణ్యము పుట 51 |
| 5 | భాగవతము – | 1848 | సంశోధిత భాగవతము (సాహిత్యఅకాడమీ) |
| 6 | వసు చరిత్ర – | 1839 | వసుచరిత్ర చతుర్థ ముద్రణ పీఠిక 1954 |
| 7 | ,, | 1844 | |
| 8 | దశావతారచరిత్ర | 1849 | శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ పుస్తక భాండాగారము |
| 9 | విజయ విలాసము | 1856 | బాలకవి శరణ్యము పుట 1 |
| 10 | రాఘవ పాండవీయము | 1857 | శ్రీ వేంకటేశ్వర విద్యాలయ భాండాగారము |
| 11 | శంకర మహిమ | 1852 | (నావద్దనున్నది) |
| 12 | వీర శైవాచార సంగ్రహము | ,, | ,, |

## వచన గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| 13 | కాశీయాత్రా చరిత్ర | 1838 | 1941. ముద్రణము |
| 14 | హంస వింశతి | 1842 | ఆ. వ. వా. పుట 76 |
| 15 | తోతినామా లేక చిలుక కథలు | 1842 | ,, 77 |
| 16 | చారు దర్వేషుకథలు | 1856 | (తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము పుట 25) |

## వ్యాకరణములు

| | | | |
|---|---|---|---|
| 17 | బాలసరస్వతీయము (ఆంధ్రశబ్దచింతామణి వ్యాఖ్య) | 1847 | ఆంధ్రకవుల చరిత్ర పుట 5 |
| 18 | ప్రశ్నోత్తరాంధ్రవ్యాకరణము | 1852 | 1951 వావిళ్ల |
| 19 | లఘువ్యాకరణము | 1856 | 1967 వావిళ్ల |
| 20 | బాల వ్యాకరణము | 1858 | ప్రసిద్ధమైనది |

## చరిత్రలు

| | | | |
|---|---|---|---|
| 21 | మహమ్మదుచరిత్ర | 1856 | ఆ. వ. వా. పుట 100 |
| 22 | జాను బన్యను చరిత్ర | 1856 | ,, |

## శాస్త్ర గ్రంథములు

| | | | |
|---|---|---|---|
| 23 | సిద్ధాంత శిరోమణి | 1837 | ,, 97 |
| 24 | భూభగోళదీపిక | 1843 | ,, 99 |
| 25 | తెలుగు చట్టములయొక్క కోశము | 1846 | (స్వంతము) |

## రెండవ ముద్రణ

| | | | |
|---|---|---|---|
| 26 | భూగోళశాస్త్రము | 1840 | గ. చి. పుట 247 |
| 27 | గణితశాస్త్ర బోధ | 1848 | ,, 272 |
| 28 | భూగోళము 3 వ కూర్పు | 1856 | ,, 246 |
| 29 | బాలబోధ | 1852 | ,, 268 |

# 1859 కి ముందు రచితములై యాతరువాత ముద్రితములైనవి

## వ చ న ము

| | | | |
|---|---|---|---|
| 30 | నీలగిరియాత్ర | 1845 | మద్రాసు ప్రభుత్వ ముద్రణ 1950 |

## వ్యా క ర ణ ము లు

| | | | |
|---|---|---|---|
| 31 | పట్టాభిరామ పండితీయము | 1816 | వావిళ్ల. 1951 |
| 32 | సూత్రాంధ్రవ్యాకరణము | 1842 | ఆంధ్రసాహిత్య పరిషత్తు కాకినాడ 1931 |
| 33 | ఆంధ్రశబ్దాను శాసనము | 1842– | |
| 34 | పద్యాంధ్ర వ్యాకరణము | 52 మధ్య | |
| | ఈ గ్రంథమునందుదాహరింపబడిన వేదము పట్టాభి రామశాస్త్రి ఆంధ్రధాతు పాఠము ధాతుమాల అను పేర చిన్నయసూరిదిగా ప్రకటితమైనది. | | ,, ,, ,, |

ఇందు కొన్ని మాత్రమే చూపితిని.

తాటాకు పుస్తకములవలె పూర్వము అచ్చయిన తెలుగు పుస్తముల కొఱకు మనము గవేషణ చేయవలసి యున్నది. ఎన్నో గ్రంథము లను పరిశీంపవలసి యున్నది. అప్పుడింకను పూర్వముద్రణ గ్రంథ ములు లభింపగలవు. ఆంధ్రసాహిత్య చరిత్రకు ముఖ్య మగునిట్టి గవేష ణకు పరిశోధకులు పూనుకొందురు గాక.

జ్ఞాపిక: ఈ క్రింది ముద్రాక్షరశాలలు పేర్కొనబడలేదు.

1843–పురాణంహయగ్రీవశాస్త్రి–వివేకాదర్శముద్రాక్షరశాల.
1853–పాల్కురికి కుమారయ్య–కళానిధి ముద్రాక్షరశాల.
1854–వావిళ్ల రామస్వామిశాస్త్రులు-ఆదిసరస్వతీ నిలయ ముద్రాక్షరశాల.

ఈ మూడును మదరాసులోనివే.

తెలుగులో అచ్చయిన పుస్తకము అనగానే ఈనాడు మన నాలు కపై నాట్యమాడునది.

వావిళ్లవారి ఆదిసరస్వతీ నిలయ ముద్రాక్షరశాల తెలుగులో వావిళ్లవారు ముద్రించినన్ని గ్రంథములు వేఱెవ్వరు ముద్రింపలే దనుటలో అతిశయోక్తి లేదు.

ఒకప్పుడు "వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి షష్టిపూర్తి సందర్భమున నిట్లు చెప్పితిని.

"బాలశిక్ష మొదలు భారతంబువఱకు
గ్రంథమేదియైన గావలసిన
వ్రాయుడిపుడె దొరకు వావిళ్లవారికి
వనెడుమాట నిలిచె తెలుగునాట—"

1854లో స్థాపితమైన యీ సంస్థ నేటికిని వర్ధిల్లు చున్నది. వావిళ్లసంస్థ పుస్తక ముద్రణమునందేకాదు-తెలుగు ముద్రణ కళయందును ప్రత్యేక స్థానము గడించినది. నేటికిని ప్రచారములో నున్న Great Primer అను టైపును క్రీ. శ. 1854లో వావిళ్ల సంస్థాపకులగు రామస్వామి శాస్త్రులుగారు మొదటిసారిగా పోత పోయించినారు.

ఇట్టి వావిళ్ల సంస్థను గూర్చి యీ గ్రంథమం దొక్క మాట యైనను లేకుండుట సమంజసముకాదు.

---

జ్ఞాపిక : గద్యచింతామణి — గ. చి.
ఆంధ్ర వచన వాఙ్మయము — ఆ. వ. వా.

# కలగూరగంప

## డబ్బా — దస్కం

"డబ్బు – దస్కం" అనేమాట (వాడుక) ఉన్నది. 'ఇవి 'సిగ్గు – సెరము' వంటిదని అనుకుంటున్నాను. సెరము అంటే హిందీలో సిగ్గు అనే అర్థము. ఇట్లనే 'నోరూ – వాయి' అనే మాట ఉన్నది. వాయి అంటే (తమిళంలో, తెలుగులో గూడాను) నోరు అనే అర్థమున్నది గద! ఇవి జంటపదాలు. ఒకదాని కొకటి ఊతగా స్పష్టతకోసం (భుశార్థములో గూడా) వాడబడుతున్నాయి. 'గంగా భాగీరథీ సమానురాలు' అంటుంటాము. గంగ అంటే భాగీరథీ అని, స్పష్టతకోసం ఈ వాడుక యేర్పడుతున్నది. శాస్త్రీయంగా పునరుక్తి దోషమే అయినా, స్పష్టతకోసం వాడుకలో దాన్ని ఆశ్రయిస్తున్నాము. రాయి – రప్ప, మాను – మాకు; నొప్పి – నోవి, ఆకు–అలము; గడ్డి–గాదము ఈ మొదలయినవి యిటువంటి ఊత పదాలు. రాగిచెంబు, గాజుగ్లాసు వంటివి గూడా వ్యుత్పత్తి ప్రకారం ఈ తెగకే చెందినవిగాని వీటి నిప్పుడు జంటపదాలుగా గ్రహించి వాడటంలేదు. చెంబు అంటే అరవంలో రాగి అని అర్థం. రాగితో చేసిన పాత్ర అని మన తెలుగులోకి దిగింది. ఇప్పుడు స్టీలుచెంబు, ప్లాస్టిక్ చెంబు వచ్చాయి. గాజుగ్లాసు సంగతి యింతే. 'మందు – మాకు' గూడా ఈ తెగకు చెందినదే, జంటపదం లేక ఊతపదం. మరం అంటే చెట్టు (తమిళం), చెట్టు యొక్క ఆకు, వేరు మొదలైన వాటితో తయారైనది – ఔషధము – మరుందు (తమిళం) మందు (తెలుగు)గా వాడుకైనది. మరం, మరంగళ్ అనే మాటల నుంచి యేర్పడినవే మ్రాకు. మాకు అనునవి. మ్రాను మాను కూడ ఇక్కడనుంచి వచ్చినవే. ఇట్లా జంటపదాలు లేక ఊతపదాలు ఏర్పడుతున్నాయి. అంటే రెండు పదాలూ ఒకే అర్థాన్ని ఇస్తున్నాయన్నమాట. "మాటా – మంతీ" లో మంతి అన్నది మంతు (రహస్యము) నుంచిగానీ, మంతీ (ఈకార స్త్రీలింగము, ఆలోచించువాడు) నుంచిగానీ వాడుకపడి ఉండవచ్చు. మా వైపు (నెల్లూరు ప్రాంతం) 'మాటా – మంచీ' అని వాడుతుంటాము. "చీకు చింత"లో చీకు అన్నది చివుకు (మనస్సు కలత నొందడము–బ్రౌణ్య.) నుంచి ఏర్పడిన రూపాంతరము. ఆస్తిపాస్తులు, పురుగు బుట్ర, పైరుపచ్చలు, చెట్టు చేమలు, ఏండ్లు పూండ్లు వంటి మరికొన్ని జంటపదాలు లేక ఊతపదాలు వాడుకలో ఉన్నవి. వీటిలోని రెండో పదానికి 'తత్సంబంధమైన లేక మొదలైన' అనే అర్థాలు వస్తున్నట్లు మనం పసిగట్ట గలుగుతున్నాము. వేరు వెల్లంకులు అంటే (Root and all) అని బ్రౌను అర్థం చెప్పడం గమనార్హం; వెల్లంకి అంటే గూడా వేరు అని అర్థం. ధూర్జటి శ్రీ కాళహస్తి మాహాత్మ్యములో "పురుగుండును బుట్రయుండు" అని జంట పదాన్ని వ్యస్తం చేసి ప్రయోగిస్తాడు. వేమన్న, "ఏరుకలు గట్టి కొన్న మటి యేండ్లను బూండ్లను బట్టు" అని అంటాడు

సారాంశ మేమిటంటే, ఇక్కడ "దస్కం" అనే మాట గూడా డబ్బుకు సంబంధించి అయియుండవలెనని భావిస్తున్నాను. ఇది యేదో ఒక హిందీ పదానికి సన్నిహిత రూపం కావచ్చునని కూడా అనుకొంటున్నాను. దస్తక్ అంటే చేవ్రాలు అని అర్థం. చేవ్రాలు గల కాగితం అంటే ప్రోనోటు లేక దస్తావేజు (వీటికి ప్రాణంబు వ్రాలు) వంటివి గూడా డబ్బుకు సంబంధించినదే గద! డబ్బా దస్కం జా గత్తు అంటే పైకమూ దానికి సంబంధించిన దస్కత్తు గల కాగితాలు భద్రం అని అభిప్రాయం కావచ్చును. దస్కత్ నుంచి దస్కం, రూపం మారి వచ్చి ఉండవచ్చు. దస్తు అంటే డబ్బు అనే అర్థం (బ్రౌణ్య) ఉన్నది. ఈ దస్తు, దస్కం అయి యుండునా? దస్త్రం అంటే కాగితాల కట్ట అని అర్థం. ఆస్తి పత్రాలు, అప్పుపత్రాలు మొదలైన వాటికట్ట–అంటే డబ్బు సంబంధమైనదే అని భావించవచ్చు. కాబట్టి ఈ దస్కం హిందీ పదం నుంచి మార్పుపొంది వచ్చి డబ్బు అనే అర్థంలోనే వాడబడిం దని ఈ సందర్భాన్ని బట్టి ఊహించవచ్చు.

— *శ్రీ బండి నాగరాజు*

## అత్యతిష్ఠత్ దశాంగుళమ్

సహస్రశీర్షా పురుషః
సహస్రాక్షః సహస్రపాత్,
స భూమిం విశ్వతో వృత్వా
అత్యతిష్ఠత్ దశాంగుళమ్.

ఈ ఋక్కు పురుషసూక్తంలోని మొదటి ఋక్కు. పూర్వం యజ్ఞం ప్రధానమైనది గనుక యజ్ఞాన్ని, యజ్ఞపతిని, సమాజాన్ని విశ్వాకారుడు, విశ్వాత్మకుడు అయిన పరమ పురుషునితో అభిన్నంగా దర్శించి గానం చేసిన సూక్తం పురుషసూక్తం.

పురుషుడు–పరమ పురుషుడైన పరమేశ్వరుడు వేయితలలు గలవాడు; వేయికన్నులు గలవాడు; వేయికాళ్లు గలవాడు; వేయి అనే మాట అసంఖ్యాకం అనడానికి ఉపలక్షణం. అనగా అన్నీ చూచేవాడు; అన్నీ ఆలోచించేవాడు; అంతటా వెళ్లేవాడు అని అర్థం. ఈ పురుషుడు భూమి అంతటా వ్యాపించినవాడు. ఇంతవరకు ఈ ఋక్కులో

మూడుపాదాలకు అర్థం స్పష్టమయింది. నాల్గవ పాదంలోనే సందేహాలు కలుగుతున్నాయి, సరిగా అన్వయం కుదరదు. ఈ పురుషుడు దశాంగుళప్రాంతం మీరి వ్యాపించినాడు అని అర్థం చెబుతున్నారు. సహస్ర శీర్షుడు, సహస్రాక్షుడు, సహస్రపాదుడు అయిన పురుషుడు విశ్వాన్నంతా వ్యాపించి దానిని మించి, దానిచుట్టూ పదిఅంగుళాలమేర వ్యాపించడ మేమిటి? కనుక నాల్గవపాదం పైవాటితో అన్వయించడం లేదు. సాయణాదులు దీనికి ఏమి భాష్యం చెప్పినారో పరిశీలిస్తే సందేహం తీరుతుందేమో చూద్దాం.

"అత్యతిష్ఠద్దశాంగులం. స పురుషః భూమిం (బ్రహ్మాండ గోల రూపాం విశ్వతః సర్వతో వృత్వా పరివేష్ట్య దశాంగులం దశాంగుల పరిమితం దేశ మత్యతిష్ఠత్, అతిక్రమ్య అవస్థితః దశాంగుల మిత్యుపలక్షణం. బ్రహ్మాండాద్బహిరపి సర్వతో వ్యాప్యావస్థితః ఇత్యర్థః" (ఋగ్వేద సంహిత, 29వ ప్రచురణం, మైసూరు) అని సాయణులవారి భాష్యం.

ఆ పురుషుడు బ్రహ్మాండ గోలకరూప మైన భూమి నంతా వ్యాపించి, పరివేష్టించి, దానిమీద పదిఅంగుళాలమేర అతి క్రమించి ఉన్నాడు. దశాంగుళమనేది ఉపలక్షణం. బ్రహ్మాండానికి వెలుపలకూడ అంతటా వ్యాపించి ఉన్నాడని అర్థం.—ఇది సాయణులవారి భాష్యార్థం.

శ్రీ రంగనాథ బ్రహ్మతంత్ర పరకాల మహాదేశికులు రచించిన పురుషసూక్త భాష్యంలో ఇలా ఉన్నది:—

"...పురుష శబ్దోక్త వ్యాప్తిం విశదయతి భూమి మిత్యాదినా. భవతీతి భూమిరితి భూశబ్దేన సత్తాయోగి సకల పదార్థజాతం ఉచ్యతే. యచ్చకించిజ్జగత్యస్మిన్ దృశ్యతే శ్రూయతేపి వా, అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః ఇత్యాది శ్రుతేః. విశ్వతః సర్వప్రదేశావచ్ఛేదేన వృత్వా ఆవృత్య వ్యాప్యేత్యర్థః, సర్వతః స్పృత్వేతి కేషాంచిత్ పాఠః. తత్ర ఛాందసత్వాత్సకారాదిత్వాద్వా విసర్జనీయస్సపః, అర్థస్సమానః, దశాంగుళం దశగుణం ఉపలక్షణ మేతత్, అనంతపరిమాణ మితి యావత్. అత్యతిష్ఠత్ అతిక్రమ్యాతిష్ఠ దిత్యర్థః కేచిత్తు "దశాంగుళం అతి అతిక్రమ్య అర్ధాన్నాభే రూర్ధ్వం దశాంగుళ మతిక్రమ్య హృదయపుండరీకే అతిష్ఠ దిత్యర్థః. అత్రచ — అంగుష్ఠమాత్రః పురుషోంతరాత్మా సదా జనానాం హృదయే సన్నివిష్టః, అంగుష్ఠమాత్రః పురుషో మధ్య ఆత్మని తిష్ఠతి, ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేర్జున తిష్ఠతీత్యాదయః శ్రుతి స్మృతయః ప్రమాణత్వేన ద్రష్టవ్యా ఇత్యాహుః?" (పుట 4-5, బ్రహ్మవిద్యా విలాస ముద్రాక్షరశాల చెన్నపురి. ప్లవకార్తిక శుద్ధ దశమి.)

పురుష శబ్దోక్తమైన వ్యాప్తిని భూమిం అనే దానితో విశదీకరిస్తున్నాడు. భవతీతి భూమి అని ఉత్పత్తి, గనుక ఉనికిగల సకల పదార్థ జాతమూ నని ఈ జగత్తులో చూడబడేది, వినబడేది ఏదయితే ఉన్నదో దాని లోపల, బయట అంతటా వ్యాపించి నారాయణుడు ఉన్నాడని శ్రుతి మరొకచోట ఈ విధంగానే చెప్పడంవల్ల సర్వప్రదేశమూ వ్యాపించి ఉన్నాడని అర్థం. దశాంగుళమంటే దశగుణమని అర్థం. ఇది ఉపలక్షణం మాత్రం. అనంత పరిమాణం అని అర్థం. అత్యతిష్ఠత్ అతిక్రమించి నిలబడ్డాడని అర్థం; కొందరు నాభికి మీద దశాంగుళ ప్రాంతం దాటి హృదయ పుండరీకంలో ఉన్నాడని అర్థం; అంగుష్ఠమాత్రు డైన పురుషుడు జనుల హృదయంలో అంతరాత్మయై నిరంతరమూ ఉంటాడు—అనీ, అంగుష్ఠమాత్రు డైన పురుషుడు సర్వభూతాల హృదయంలో, ఆత్మమధ్యన ఉంటాడు—మొదలైనవి శ్రుతిస్మృతులు ప్రమాణంగా చూడాలి అన్నారు—అని ఈ భాష్యంతాత్పర్యం.

నవీనకాల భాష్యకారు లయిన దయానందులవారు ఏమి చెబుతారో చూద్దాం:—

"...అత్ర మంత్రే పురుష ఇతి పదం విశేష్యమస్తి. సహస్రశీర్షేత్యాదీని విశేషణాని చ. అత్ర పురుష శబ్దార్థే ప్రమాణాని—పురుషః పురిశయ ఇత్యాచక్షీరన్. ని. అ-1, ఖం-13. (పురి) సంసారే శేతే సర్వమభివ్యాప్య వర్తతే. సపురుషః పరమేశ్వరః పురుషః పురిషాదః పురిశయః పూరయతేర్వా పూరయత్యంతరిత్యంతిక పురుష మభిప్రేత్య యస్మాత్పరం నాపరమస్తి కించి ద్యస్మాన్నాణీయో నజ్యాయోస్తి కించిత్. వృక్ష ఇవ స్తబ్ధో దివి తిష్ఠత్యేకః తేనేదం పూర్ణం పురుషేణ సర్వ మిత్యపి నిగమో భవతి...స భూమిం సర్వతః స్పృత్వా—స పురుషః పరమేశ్వరః సర్వేభ్యో బాహ్యాంతర్దేశేభ్యో భూమిరితి భూతానాం ఉపలక్షణం. భూమి మారభ్య ప్రకృతి పర్యంతం సర్వం జగత్ స్పృత్వా అభివ్యాప్య, వర్తతే. అత్య—దశాంగుళమితి—బ్రహ్మాండ హృదయయో రుపలక్షణం. అంగుళ మిత్యవయ వోప లక్షణేన మితస్య జగతోత్ర గ్రహణం భవతి. పంచస్థూల భూతాని పంచసూక్ష్మాణి చైత దుభయం మిళిత్వా దశావయవాఖ్యం సకలజగదస్తి. అన్యచ్చ—పంచప్రాణాః సేంద్రియ చతుష్టయం అంతఃకరణం సకలం జగదస్తి. ఏవమే వాన్యదపి—జీవస్య హృదయం దశాంగుళ పరిమితం చ తృతీయం గృహ్యతే. ఏతత్త్రయం స్పృత్వా వ్యాప్యాతిష్ఠత్, ఏతస్మాత్త్రయాద్ బహిరపి వ్యాప్తస్సన్ అవస్థితః, అర్థాత్ బహిరంతశ్చ పూర్ణో భూత్వా పరమేశ్వరః అవతిష్ఠత ఇతి వేద్యః" (ఋగ్వేదాది భాష్యభూమికా సృష్టివిద్యావిషయః పుట 156-157).

ఈ మంత్రంలో పురుష అనే పదం విశేష్యం. సహస్రశీర్ష

మొదలైనవి విశేషణాలు. పురుష శబ్దానికి ప్రమాణాలున్నవి:-పురుషః పురిశయ ఇత్యాచక్షీరన్-నిరుక్తం 6-1, 210-13. పురి సంసారమందు శేతే అంతటా వ్యాపించి ఉన్నవాడు......దయానందుల వారు సభూమిం విశ్వతః స్పృత్వా అనే పాఠం గ్రహించి భాష్యం చేశారు. ఆ పురుషుడు-పరమేశ్వరుడు బాహ్యాంతర్దేశాలను అన్నిటిని వ్యాపించి, భూమి అనేది భూతాలన్నిటికి ఉపలక్షణం. భూమి మొదలు కొని ప్రకృతి పర్యంతం సర్వజగత్తును వ్యాపించి ఉన్నాడు అత్యతిష్ఠద్దశాంగుళ మనేది బ్రహ్మాండానికి హృదయానికి ఉపలక్షణం. అంగుళ మనేమాటవల్ల అవయవోపలక్షణంతో కొలచబడిన జగత్తును గ్రహించాలి.స్థూలభూతాలు ఐదు;సూక్ష్మభూతాలు ఐదు-ఇవి రెండూ కలసి దశావయవాలుగల సకల జగత్తని అర్థం. మరొక విధంగాను చెప్ప వచ్చు: ఐదు ప్రాణాలు, ఇంద్రియ చతుష్టయం, అంతఃకరణం మొత్తం పదిగల సకల జగత్తు. మరొకవిధంగాను చెప్పవచ్చు. జీవుని హృదయం దశాంగుళ పరిమితం. ఈ విధంగా ఈ మూడింటినీ వ్యాపించి ఉన్నాడు; ఈ మూడింటి వెలుపల కూడ వ్యాపించిఉన్నాడు. అనగా బహిరంతర్భాగాలలోను పూర్ణుడై పరమేశ్వరుడు ఉంటున్నాడు అని తెలుసుకోవాలి-అని సారాంశం.

ఈ మూడు భాష్యాలు చదివినా, భూమినంతా వ్యాపించిన పరమేశ్వరుడు పది అంగుళాలు మీరి ఎందుకున్నాడో స్పష్టంకాలేదు. భూమినంతా వ్యాపించి దానిమీద పది అంగుళాలు-పదివేళ్లతో కొలవదగినంత ప్రదేశం వ్యాపించి ఉన్నదని, దశాంగుళమనేది ఉపలక్షణమని బ్రహ్మాండానికి వెలుపల గూడ అంతటా వ్యాపించి ఉన్నదన్న విద్యారణ్యులవారి భాష్యంలో అంగుళ శబ్దానికి స్పష్టమైన అర్థం లేదు.

దశాంగుళమంటే దశగుణం-పదింతలని, అనంత పరిణామానికి ఇది ఉపలక్షణ మాత్ర మని శ్రీ రంగనాథ బ్రహ్మతంత్ర పరకాల మహాదేశికులు వ్యాఖ్యానించారు. దశాంగుళమంటే. నాభికి పైద పది అంగుళాలు దాటిన తర్వాత హృదయపుండరీకంలో అధిష్ఠించి ఉన్నాడని కొందరన్నారని వారు మతాంతరం ఉదాహరించి, దానికి ప్రమాణాలు తెలిపారు. వీరుకూడ అంగుళ శబ్దానికి స్పష్టమైన అర్థం చెప్పలేదు.

శ్రీ దయానందులవారు దశాంగుళ శబ్దాన్ని వ్యాఖ్యానిస్తూ మూడువాదాలు ఉదాహరించారు. అవయవోప లక్షణంతో కొలవబడే జగత్తును గ్రహించాలి; అది స్థూల సూక్ష్మరూపాలతో పదిగనుక దశావయవాఖ్యమై సకల జగత్తు అన్నారు. పంచప్రాణాలు, ఇంద్రియ చతుష్టయం, అంతఃకరణం-ఏతదాత్మకమైన సకల జగత్తని రెండవ వాదం తెలిపారు. మూడవవాదం-జీవుని హృదయం దశాంగుళ పరిమితం గనుక దానిని అతిక్రమించుకొని ఉన్న పురుషుడు అని, ఈ విధంగా ఈ మూడింటినీ వ్యాపించి, దీని పైనగూడ-అనగా లోపల, వెలుపల వ్యాపించినిండి ఉన్నాడని తాత్పర్యం-అంటారు. కాని, అంగుళ శబ్దం సరిగా వ్యాఖ్యాతం కాలేదు.

ఎంత ఆలోచించినా, ఈ భాష్యార్థాలు ఎంతమననం చేసినా, భూమిని సర్వత్రా వ్యాపించిన సహస్ర శీర్షుడు, సహస్ర పాదుడు, సహస్రాక్షుడైన పురుషుడు దశాంగుళం మాత్రం ఎందుకు అతిక్రమించి ఉండాలి? ముగ్గురు భాష్యకారులు అంగుళశబ్దం ఉపలక్షణమనే అన్నారుగాని స్పష్టంగా వ్యాఖ్యానించలేదు. కనుక అంగుళ శబ్దానికి మరొక అర్థం మంత్రంలోని మూడు పాదాలను నాల్గవ దానితో అన్వయించి సుబోధకమయ్యేది ఉందేమో చూద్దాం!

'అంగుళమితి దిక్'అని నిరుక్తంలో ఉన్నదని పండితభూషణం శ్రీ పెరుమాళ్ల గుండాచార్యులవారు (ఎం. ఎ) నాతో అన్నారు కాని, నేను నిరుక్తం చూడలేదు. కనుక సంస్కృత సజాతీయ భాషల సహాయంతో దీని అర్థం తెలుసుకొనడానికి ప్రయత్నిస్తాను-

ఇంగ్లీషుతో **Angle** అన్న పదానికి **A corner, The meeting place of two lines not in the same direction, a nook.** అని అర్థం. మధ్యకాలపు ఇంగ్లీషులో **Any of the four houses at the cardinal points of the compess (M. E.)** అని అర్థం. లాటిన్ భాషలో **Angules** ఫ్రెంచిభాషలో **Augulam.**

పై అర్థాలనుబట్టి అంగులం అన్న పదానికి మూల, రెండు రేఖలు చేరే కోణం, కేంద్రస్థానాలు అనే అర్థాలున్నట్టు స్పష్టం కదా. కోణం, కేంద్రం. మూల దిక్కుగాక మరేమవుతుంది? ఈ ఈ సంస్కృత సజాతీయ భాషల సమానార్థక పదాల అర్థాన్నిబట్టి అంగుళశబ్దానికి దిక్కు అని మనం అర్థం చెప్పుకుంటే, సహస్ర శీర్షుడు, సహస్రాక్షుడు, సహస్ర పాత్తు అయిన పురుషుడు విశ్వమంతా వ్యాపించి దశాంగుళం దశదిక్కులను దాటి, అతిక్రమించి నిలబడ్డాడు-అని అర్థం కుదురుతుంది; డొంక తిరుగుడు లేకుండా పై మూడుపాదాలకు నాల్గవ పాదంతో అన్వయమూ కుదురుతుంది. అంగుల శబ్దానికి దిక్కు అనే అర్థం నిరుక్తకారుని కాలానికే వ్యవహారచ్యుత మయిపోయి వుండవచ్చు. వ్యాఖ్యాతలూ దానిని విడిగా చేర్చి వుండరు.

అర్ధ శతాబ్ది క్రింద ఊర్ణనాభమా, ఊర్ణవాభమా అని శబ్ద సాధుత్వ మీమాంస వచ్చినప్పుడు ఊర్ణం నాభౌ యస్యసః అనే వ్యుత్పత్తి సరికాదని, ప్రాచీన రూపం ఊర్ణ వాభమే నని, సంస్కృత సజాతీయ భాషలలో **web** పదం ఉంది గనుక వాభమే సాధువని శ్రీ గిడుగు రామమూర్తి పంతులుగారు నిర్ధరించారు. కనుక, మనకు

వైదిక పదాల విషయంలోగాని లౌకిక సంస్కృత పదాల విషయంలో గాని సందేహాలు ఏర్పడినప్పుడు, సాధుత్వాసాధుత్వ విచికిత్స ఏర్పడి నప్పుడు సంస్కృత సజాతీయ భాషలు చాలా తోడ్పడుతాయి.

— శ్రీ తిరుమల రామచంద్ర

## నన్నిచోడుని ఛన్దః పరిశీలన

కవిరాజశిఖామణి యగు నన్నిచోడ కవిరాజు తన కుమార సమ్భవ 'దివ్య కృతి' యందు దశమాశ్వాసములో 'క్రౌంచగతి' వృత్తము వ్రాసెను. కాని అకాడెమీ, వావిళ్ళవారి ముద్రణలందు 'క్రౌంచపదము' అనియే ఉన్నది.

అనన్తకవి ఛన్దోదర్పణమున 'సంకృతి' యందు పుట్టిన 'క్రౌంచపదము' ను వివరించెను. దీని గణములు - భ, మ, స, భ, న, న. న, య—లు యతి రెండు చోటుల చెప్పబడినది, 11 వ అక్షరము; 19 వ అక్షరమును అనగా పాదమునకు ఇఱువది నాలుగు అక్షరము లుండవలెను.

కవిరాజ శిఖామణియు, గణములు అవియే (భ, మ, స, భ, స, న, న, య) వాడినను యతియందు భేదము చూపినాడు. ఇతడు ఏడవచోట 'ప్రాసయతి' ని కూర్చినాడు. ముద్రాలంకార ప్రియుడగుటవలన 'క్రౌంచగతి' అని వృత్తనామమును పద్యమున (౧౦-౭౦) నిబంధించెను. ఇతర స్థలములందు 'మణి గణ నికరము, మానిని, స్వాగతము, మత్తకోకిల అదిపద్యముల నామము లను ఆయా పద్యములందు నిబంధించుట ఇక్కవికి మక్కువ. అందు చేత ఇతడు వాడినది స్పష్టముగ 'క్రౌంచగతి' యే కాని, పరిష్కర్తలు భావించిన విధముగ 'క్రౌంచ పదము'ను వాడలేదు. కాన సంస్కృత మున 'అతికృతి ఛందము'న కలది క్రౌంచపదము' గలదు. అది ఇది కాదు. లతికృత్యాం క్రౌంచ పదాబ్దో, భరౌ నననా నగౌ; మునిశర వసుశర విరతియుతా—అని వృత్త రత్నాకరము. తన కావ్యాంతమున మంగళమహాశ్రీ 'వృత్తమును ప్రయోగించుటయేగాక కావ్యపు చివరి పదము 'మంగళమహాశ్రీ' అని వచ్చునట్లు చేసి అనల్ప శిల్పమును సాధించినాడు. కాని—శ్రీ మా. కవిగారును, మద్రాసు విశ్వవిద్యాలయ ప్రతి సంపాదకులును, వావిళ్ళ ప్రతి పరిష్కర్తయును, తుదకు అకాడెమీ ప్రతి సంపాదయితయును 'అందలి ప్రథమ పాదము నందలి

గణ భంగము' గమనింపక పోవుట చిత్రము. 'మంగళమహాశ్రీ' ఉత్కృతి ఛందమున జనించిన వృత్తము. దీని గణములు— మ, మ, త, న, న, న, స, లగ—లు. యతి చోటులు 9 వ లక్షరము, 19 వ అక్షరము. కాని నన్నిచోడుడు 9, 17 అక్షరములపై యతిని యోగించి తన స్వాతంత్ర్యమును వెలార్చినాడు. కాని మొదటి పాదమున ఇరువది రెండు అక్షరము లున్నవి. నాల్గక్షరములు లుప్త మయినవి. పండితులు దీనిని గూర్చి తెలుపుదురు గాక.

—శ్రీ ఇ. సాయిబాబా.

## గణపతి — వసు చరిత్రము

కళా ప్రపూర్ణ శ్రీ విడుదవోలు వెంకటరావు 1975 "భారతి" అక్టోబరు సంచికలో 'గణపతి తెలుగు సాహిత్యం' పేరుతో ఒక వ్యాసాన్ని, పరిశోధనాత్మక మయిన దాన్ని ప్రకటించేరు. దాన్ని 1976 జనవరి సంచికలో 'గణపతి—తెలుగువారు' పేరుతో శ్రీ కపిల వాయి లింగమూర్తి కొనసాగించేరు. వారే వసుచరిత్రలోని గణపతిని పేర్కొని,

"అతనికి పితృస్వాంతాలు అలరింపజేసే ప్రాథత్యం వచ్చేసింది కుమారాగ్రేసరుడైనాడు."

అన్నారు. ఆ 'కుమారాగ్రేసరుని' నేను దర్శించిన తీరున మనవి చేస్తున్నాను. వావిళ్లవారి ముద్రణ పాఠాన్ని అనుసరించి వ్యాఖ్యా నిస్తున్నాను. చిత్తగించండి!

"దంతాఘట్టిత రాజతాచలచలద్గౌరీ స్వయంగ్రాహముం
గంతుద్వేషికిఁ గూర్చి, శైలజకుఁ దక్షంగా ఁ దురాచాంతిస
త్యంతామోదము మున్నుగా నిడి, కుమారాగ్రేసరుండై పితృ
స్వాంతంబుల్ వెలయింపఁజాలునిభరాడ్వక్త్రుఁడ్ శ్రీఁ బెంపొదవన్"
(వసు-1-7)

కర్త ఇభరాడ్వక్త్రుడు. గజముఖుడని తాత్పర్యం.

జల, వప్ర క్రీడలు ఏనుగులకు సహజమైనవి. గజముఖుడు గనక గణపతికీ సహజమైనవి.

జల, వప్ర—క్రీడల్లో క్రమానికి జలక్రీడ మొదటిది. మడుగుల్లో దిగి నీటిని తొండాలలో పీల్చడమూ, చిమ్మడమూ 'జలక్రీడ'. ఒడ్డుల్ని దంతాలతో పెళ్ళగించడమూ తామే మహాపర్వతా లయినట్లు కొండ లను కదపబూనడమూ 'వప్రక్రీడ'.

ఈ క్రీడలలో పితరులకు (తల్లిదండ్రులకు) సంతోషాన్ని కలుగజేసేడు గజముఖుడు. తల్లికి జలక్రీడతో, తండ్రికి వప్రక్రీడతో, క్రమంలో ముందు చెప్పవలసింది తల్లినీ, జలక్రీడనూ. కాని కవి పద్యంలో వ్యుత్క్రమాన్ని పాటించేడు. దానికి ప్రయోజనం ముఖ్యంగా కవిహృదయం. అందుచేతనే 'మున్నుగా' తల్లినీ, జలక్రీడనూ 'యిడుకో' మన్నాడు. ఆ ప్రకార మిదిగో:

గజముఖుడు గంగానదిలో దిగేడు. జలక్రీడ వ్యాజంగా గంగా ప్రవాహాన్ని ఆపోశన పట్టేసేడు. గంగ అడుగంటింది.

'శైలజ' అంటే కొండకూతురు. ఆమెహృదయం పాషాణ మని తాత్పర్యం. గంగ సాటివ్యక్తి అయినా— సవతిగనక— అడుగంటడం శైలజకు అత్యంతామోదం!

తరువాత 'హిమవంతుడు' వప్రక్రీడ వ్యాజంతో వెండికొండను కదిపేడు. కొండ కదిలింది.

దానిపైని శైలజ వున్నది. కంతుద్వేషి వున్నాడు. కొండ కంపించడంచేత శైలజ వెరచింది. ఏణికింది. వచ్చి 'తానుగా (స్వయం)' కంతుద్వేషిని కవుగిలించింది. పార్వతియొక్క కౌగిలింతను కంతుద్వేషికి కలుగజేసేటివి ఫలితం.

'కంతుద్వేషి' సాభిప్రాయ మయిన మాట.

ఒకప్పుడు శివుడు వెండికొండపైని తపస్సు చేసుకొంటు న్నాడు. హిమవంతుడు తన కూతురు శైలజను అతని సపర్యలకు నియోగించేడు. లవతల తారకసంహారం జరగాలి. అందుకు కుమా రుడు పుట్టాలి. అతడు గిరిజాశంకరులకు పుట్టాలి. ఇంకా శివ పార్వతులకు పెళ్ళి కాలేదు. అయినా వారిని సంధానపరచడానికి మారుడు బయిలుదేరేడు. పార్వతి శివునికి సపర్యలు చేస్తున్న అదును చూసి కంతుడు శివునిపై పూలబాణం విసిరేడు. శివునితప మాగింది. ఒంట్లో తాపం చెలరేగింది. పర్యవసానంగా ఆ యలజడికి కారకు డయిన మారుడు ముక్కంటికంటిమంటలకు గురయినాడు.

అప్పుడు శివుడు కంతుద్వేషి.

మారుడూ పార్వతికౌగిలింతనే కలిగించబోయాడు. కాని విఫ

డడు. అట్టి కంతుద్వేషికి కవుగిలింత కలుగజేయడం మాటలు కాదు మరి! అది కు-మార-అగ్రేసరుడు మాత్రమే చేయగలిగిన పని.

ఈ పార్వతికౌగిలి శివునికి యిష్టమా? 'కూర్చి' అనడం గమనింపదగింది. 'కలుగజేసి' సామాన్యం. 'ప్రియముచేసి' విశేషం. ఈ యర్థాన్ని ఆ క్రియారూపం విపింపజేస్తుంది.

మారుడు కుత్సితుడు. కుత్సిత మయిన విధానం అవలంబించినా డని. అతని యత్నం శివపార్వతులలో యెవరికీ యిష్టమైనది కాదు. కారణ మిదివరకే చెప్పడం జరిగింది. గజముఖునిపూనిక అతనికి సహజ మైన క్రీడ. శివపార్వతులకు కూర్చేది కూడా.

మారుని యత్నం శివుడు పార్వతిని కౌగిలించుకొనేటట్లు చేయడం. గజముఖుని పూనిక పార్వతి ,తానుగా' కౌగిలించుకోవడం.

అయితే కంతుని యత్నం పెళ్ళికాక మునుపు. గజముఖుని పూనిక వెనక కదా! ఆలుమగలు కౌగిలించుకోరా? గజముఖుడే వుండాలా? అతని విశేష మేమిటని సందేహం కలుగుతుంది. దానికి సమాధానమే కవిహృదయం!

వెరపొక్కటే కారణ మయితే 'స్వయం' మాట వట్టిపోతుంది. కనుక 'స్వయం, కంతుద్వేషి, మున్నుగా నిడి' అనే మూడు మాటలూ ఆధారంగా కొంత భావన చేయవలసింది వుంది.

శివుడు గంగను నెత్తికెక్కించుకొనడంవల్ల. ఈ విషయాన్ని జలక్రీడలో వర్ణించేడుగదా కవి!-శైలజ ప్రణయకోపం వహించి శివునికి అనతిదూరంలో పెడమొగమై వుండాలి! వారిరువురినీ కలపా లంటే, వారి నడుమనున్న వలపుటలుక మటుమాయం కావాలంటే 'మున్నుగా' సవతిపిడ విరగడ కావాలి. అందుచే 'మున్నుగా' జలక్రీడ 'విడుకో'మనడం. అందుకే వ్యతిక్రమాన్ని పాటించడం. తరువాత వారిని కలపడానికొక వ్యాజం వప్రక్రీడ. అభిమానాల ప్రసక్తి రాకుండా.

జల, వప్ర-క్రీడలను గిరిజాశంకరులకు వేరువేరుగా చెప్పినా ఫలితం ప్రణయకలహాన్ని పారద్రోలడం. తల్లిదండ్రులిరువురూ అర్థ మయిన 'పిత్ర' శబ్దాన్ని అందుకే ప్రయోగించేడు.

మారుడు ప్రణయ కలహాలు పెంచేవాడు. అంటే సవతుల్ని పెంచేవాడని. ఇప్పుడు గజముఖుడు తుంచేవాడనీ.

అందుచేత అతడు కుత్సితుడయిన మారునికన్న అగ్రేసరుడే!

కుమారాగ్రేసరుడంటే కొడుకుల్లో ఉత్తముడని తాత్పర్యం. పైగా అదొక పలుకుబడి. ఇప్పుడు చవటకే వర్తిస్తుంది. 'కుమార స్వామికన్న నగ్రజుడై' అని పూర్వవ్యాఖ్యానం. అది సరికాదేమో? దానినే మరొకరకంగా చెప్తే బాగుండవచ్చును.

కుమారుడయిన (శ్లిష్ట విశేషణం) కుమారస్వామికన్న ఉత్తముడై. ఇభరాడ్వక్త్రుడు కొడుకుకాడు. కాదు గనకనే యిభరాడ్వక్త్రుడు.

'కుమార' శబ్దం 'కౌమారం' దశకి సూచకమయితే అందరు కుమారులా (అందరి కుమారుల్లా) తల్లిదండ్రుల స్నేహాలను వెలయించలేరో...?

చివర యిభరాడ్వక్త్రుడనడమూ సాభిప్రాయమే!

—శ్రీ నాగార్జునశ్రీ

## నారాయణభట్టు-భట్టనారాయణుడు:—

కొంతకాలముక్రిందట 'భారతి'లో శ్రీయుతు వెంకటేశ్వర్లు గారు నారాయణభట్టు కాలనిర్ణయాదికమును గూర్చి వ్రాయుచు, సంస్కృతమున వేణీసంహార నాటక రచయిత యగు భట్టనారాయణుడును, నన్నయగారి సహాధ్యాయుఁడైన నారాయణభట్టును ఒక్క వ్యక్తియేనా? అని శంకించుచు, నిర్ణయించుటకు తగ్గదే యగుటయుఁ దగిన ఆధారములు దొరికిన యెడల ఆంధ్రసాహిత్య విమర్శకులకుఁ జాల ఉపకారము జరిగినట్లగును అనుచు, దానియాధారముల గవేషింప వలసిన యావశ్యకతను సూచించిరి.

సంస్కృతాలంకారిక గ్రంథములలో ప్రముఖ మగు ధ్వన్యాలోకమునకుఁగల 'దీధితి' వ్యాఖ్యానము నేనడుమఁ జూచుచుండఁగా దీనికి దగిన యాధార మొకటి లభించుటచే దానిని భారతి పాఠకలోకమున కందింపఁదలఁచి యిది వ్రాయుటయైనది.

ధ్వన్యాలోకము తృతీయోద్ద్యోతమున ప్రబంధము రస వ్యంజకమగుటకు కవి తీసికొనవలసిన జాగ్రత్తలను వివరించు.

“సంధి సంధ్యంగ ఘటనం రసాభ్యక్త్యపేక్షయా
న తు కేవలయా శాస్త్ర స్థితి సంపాదనేచ్ఛయా”

అను 12 వ కారికను వివరించుచు ఆలోకములో

“అనౌచిత్యాదృతే నాన్యద్రసభంగస్య కారణం
ప్రసిద్ధౌచిత్య బంధస్తు రసస్యోపనిషత్ పరా”

అని ఔచిత్యమును బాటించుట ఆవశ్యకమని తెలిపి. ఔచిత్యమును బాటించుటలోని ప్రకారములను దెలుపు ఘట్టములో:—

నాటకాదులలో ముఖ ప్రతిముఖాది సంధులనుగాని. ఉపక్షేప పరికరాది సంధ్యంగములనుగాని ఔచిత్యము ననుసరించి రసాభివ్యక్త్యపేక్షతోఁగూర్పవలయునే కాని కేవలశాస్త్ర సంపాదనాభిలాషతో వానిని గూర్పరాదని తెలుపుచు, వ్యతిరేక దృష్టాంతముగా:—

"యథా వేణీసంహారే విలాసాఖ్యస్య ప్రతిముఖ సంధ్యంగస్య ప్రకృతరస నిబంధనాననుగుణమపి ద్వితీయేంకే భరత మతానుసరణమాత్రేచ్ఛయా ఘటనం" అని యుదాహరించినాఁడు.

దీనికి "దీధితి" వివరణములో

"వేణీసంహారే వీరర సప్రధాన నాటకే–'సమీహారతిభోగార్థా విలాస ఇతి కథ్యతే" ఇతి దర్పణ లక్షితో రత్యాఖ్య భావ హేతు భూత భోగ విషయ నాయికాది విషయ కేచ్ఛారూపో హి విలాసః, ప్రతిముఖ సంధి ప్రథమాంగం నారాయణభట్టేన ప్రకృత వీర రసానుగుణ్య మనవేక్ష్యైవ భానుమతీ దుర్యోధనయోర్యోగే ద్వితీయేంకే కేవల భరతానుశాసన శ్రద్ధాజాడ్యేన యథా నివేశితో రసం న పుష్ణాతి, తథైవ తాదృశమన్య దపి ఇతి తత్ పరిహరణీయ మిత్యాకూతం" అని వ్రాయఁబడినది.

ఇచ్చట దీధితికారుఁడు "భట్టనారాయణేన" అనక "నారాయణభట్టేన" అనెను. 'భట్టనారాయణేన' అని వ్రాయలేక పోయినాఁడా ? కావున నారాయణ భట్టను పేరును గూడ నీయన కుండా నోపునేమో !

ఈ వ్యాఖ్యాత యగు శ్రీ బదరీనాథ శర్మ యను వారు ముజఫర్‌పూరు గవర్నమెంటు సాహిత్య మహా విద్యాలయమున సాహిత్య ప్రధానాచార్యులు. ఈ శతాబ్ది అరంభములోని వారు. వీరు క్రీ. శ. 1928–35 ప్రాంతమున నీ వ్యాఖ్యను రచించి ప్రకటించి యున్నారు. ప్రామాణికముగాఁ దీసివేయుటకు గూడ వీలులేదు.

ఈ సంశయమును నివారించి "భట్టనారాయణుఁడే వేణీసంహారకర్త"యను నిర్ణయము సేయఁజాలు వంశవర్ణనాదిక మేదేని వేణీసంహార నాటక ప్రస్తావమునఁ గలదేమో! అని విచారింపఁగా అట్టి నిర్ధారణ చేయఁజాలు వచనము లేవియు నచట లేకుండుట గమనింపఁబడినది. దానిలో సూత్రధార వాక్య మిది:—

తదిదం కవేః మృగరాజ లక్ష్మణో భట్ట నారాయణస్య కృతి మభినవం వేణీ సంహారం నామ నాటకం ప్రయోక్తు ముద్యతాస్స్మః"

"మృగరాజ లక్ష్మణః "అను విశేషణము దప్ప మరి యితరములగు నెట్టి విశేషములను అనఁగా తల్లిదండ్రులను గూర్చి కాని, నివాసస్థానమును గూర్చి కాని, గురువులు మున్నగు వారిని గూర్చి కాని విశేషములను దెలుపు విశేషణము లిందుఁగానరావు. గ్రంథాంతమును గూడ నట్టి వేనియును లేవు.

ఈ విధముగా నారాయణభట్టు కంటె భిన్నత్వమును సూచించుచు నెట్టి విశేషములును లభింపక పోవుటచే ఐక్యమును సంఘటింపఁజేయు నవకాశములు కన్పించుచున్నవి.

కావున భట్టనారాయణుఁడే నారాయణభట్టగునేమో సహృదయులు విమర్శింపఁగోరుచున్నాను.

— శ్రీ అవ్వారి వాసుదేవశాస్త్రి

# లేఖలు

## "కోరుకొండ" రాజధానిగా పాలించిన "మంచికొండ" రెడ్ల సామ్రాజ్య మెంతవరకు?

కోరుకొండలోని ముమ్మడి నాయకుని శాసనము :—

శ్లో॥ పానార–కోన–కురవాటక–చెంగరాదీన్
గోదావరీ ముభయ తోయముపాంతదేశాన్
జిత్వాపణచర జలస్థల దుర్గరమ్యా
నేకః ప్రశాస్తి చిరమప్రతిశాసనం సః

శ్రీరంగ శాసనము :—
ప్రతితో భయగోదావరీ మధ్య ప్రాంతేషు మహిత సౌభాగ్యవాన్
పాలయతి ముమ్మడేంద్రశ్చెంగర–కురవాట–కోనపాణరాన్.

పై శాసనములను బట్టి ముమ్మడినాయకుడు–పాణర–కోన–కురవాట–చెంగర సీమలను పాలించినట్లు వెల్లడియగుచున్నది. కోన–అనగా–కోనసీమలోని–అమలాపురం–రాజోలు–కొత్తపేట తాలూకాలు.

పాణర–అనగా–వసిష్ఠకును గోస్తనీనదికిని మధ్యగల తణుకు భీమవరం, నరసాపురం తాలూకాలు.

కురవాట-అనగా కాకినాడలోని కూరాడ ప్రాంతము, చెంగర–అనగా–చాగల్నాడు–రాజమహేంద్రవరము - పెద్దాపురము తాలూకాలని చరిత్ర కారులు నిర్దేశించి యున్నారు.

కాని కోరుకొండ రాజ్యమునకు చుట్టును ప్రబల మైన స్వతంత్రరాజ్యము లున్నట్లు శాసనములు తెలుపుచున్నవి.

పాణరసీమ :- (పెదఉండి - చినఉండి రాజులు) ఉండి రాజుల పాలనలో నున్నట్లును,

పొట్నూరు సీమను జేట విజయాదిత్యుని సంతతికి చెందిన జేట చాళుక్యులు నిడదవోలు రాజధానిగా పాలించుచున్నట్లును, కోనసీమను హైహయ వంశీయుడైన కోన భీముడు పాలించుచున్నట్లును,

చెంగరసీమను—చోళ భక్తిరాజు కొడుకు భీమచోళుడు కామవరపు కోట రాజధానిగా చాగల్నాడును—

సబ్బినాడును-అన్నిదేవర చోళుడు రామగిరి రాజధానిగాను కురవాట సీమను పిఠాపురపు వీరసామంతులు కొప్పుల వారు పిఠాపురం-కొత్తాం రాజధానులుగాను (కాకినాడ—పిఠాపురం-తుని—విశాఖపట్నము ప్రాంతాలు)

లొయ్యేరు రాజ్యమును నాగవంశపు వల్లభేంద్రుని చేతను పాలింపబడుచున్నట్లు శాసనములవలన వెల్లడియగుచున్నది. ఈ రాజులందరును పరస్పర సంబంధ బాంధవ్యములు గలవారు. అట్టి యెడ కోరుకొండ రెడ్ల సామ్రాజ్యము తూర్పు—పశ్చిమగోదావరి జిల్లాలలో వ్యాపించుట ఎట్లు సంభవించును ?

పరిశీలింపగా వీరి సామ్రాజ్యము రాజమహేంద్రవరము తాలూకా లోని కొంతమాత్రమే యని తెలియుచున్నది—

ముమ్మడి నాయకుడు రాజమహేంద్రవరము తాలూకాలోని కోరుకొండ రాజధానిగాను—సింగయనాయకుడు—కోటను (నేటి కోటి) గన్నయనాయకుడు తాటిపాకను కేంద్రములుగా పాలించినట్లు చెప్పకొనవలసి వచ్చుచున్నది.

పై విషయములను చరిత్ర కారులు—విమర్శకులు—పరిశీలించి మంచికొండరెడ్ల సామ్రాజ్యమును—గురించిన చారిత్ర కాధారములను మాకు తెలియజేసి మా చరిత్ర పరిశోధన కృషిలో సహకరింపవలసినదిగా ప్రార్థించుచున్నాము.

— శ్రీ గుండు విఘ్నేశ్వర శాస్త్రి.

* * *

ఆర్యా !

భారతి 1976 ఫిబ్రవరి సంచికలో శ్రీ యామిజాల పద్మనాభస్వామిగారు చాటు మాటంలో నమస్కార ప్రియో భానుః అని వ్రాసారు కాని పూర్తిశ్లోకం ఇవ్వలేదు. పాఠకులకు ఉపయోగ పడుతుందని పూర్తి శ్లోకం ఇస్తున్నాను.

శ్లో. అలంకార ప్రియో విష్ణుః
అభిషేక ప్రియ శ్శివః
నమస్కార ప్రియో భానుః
బ్రాహ్మణో భోజన ప్రియః

ఇది అందరికీ సులభంగా అర్థం అవుతుం దనుకుంటాను.

* * *

ఆర్యా !

భారతి 1976 జనవరి సంచికలో శ్రీ బ్బూరి వారు యక్షులపై వ్రాసిన వ్యాసము చదివిన తరువాత ఈ జాబు వ్రాయాలనిపించింది. మా స్వగ్రామమైన వాయలపాడు (చిత్తూరుజిల్లా) ఒక కొండకు 'అక్కగార్లకొండ' అని పేరు. ఆ కొండమధ్య లోయలో అక్కగార్లను ప్రతిష్ఠించారు. ప్రతిసంవత్సరమూ మట్టితో చేసిన గుర్రాలను వీటికి సమర్పిస్తూ వుంటారు. శ్రీ అబ్బూరి వారికి ఈ విషయము ఉపయోగపడుతుందని ఆశిస్తున్నాను.

— శ్రీ టి. మోహనరావు.

# గ్రంథ విమర్శలు

## ఆలోచనాలోచనాలు

[రచన: మహాకవి, కళాప్రపూర్ణ, డాక్టర్ దాశరథి. డెమ్మీ 112 పేజీలు వెల 5 రూ. ప్రకాశకులు మహేంద్ర ప్రచురణలు, 90-సి, వి. యస్. స్ట్రీట్, మద్రాసు—4. ప్రతులకు—ఆంధ్ర ప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, రాష్ట్రపతిరోడ్, సికిందరాబాదు—3

'దాశరథి కలంనుంచి వెలువడే ప్రతి కవిత, మన తెలుగు భాషకు, సంస్కృతికి, భావ సమైక్యతకు తోడ్పడుతుందని నా విశ్వాసం' అని ఈ కృతిని స్వీకరించిన ఆంధ్రప్రదేశ రాష్ట్ర ప్రధానామాత్యులు శ్రీ జలగం వెంగళరావుగారు తమ అభిప్రాయాన్ని వెల్లడిస్తున్నారు. దానికి చేతు లెత్తేవారేకాని, భిన్నంగా ఉండేవారు ఉండరనుకుంటాను..

కవి అన్నవాడు గదిలో కూర్చుని, తలుపులు మూసుకుని, తనకు తోచినట్లూ చెయ్యి సాగినట్లూ కలాన్ని పోనిచ్చి కవితలు రాసి, ప్రజలపై పడవేసినంత మాత్రాన తన బాధ్యత తీరిపోయిందని తృప్తిపడితే కుదరదు. ప్రజోద్యమాల్లోనూ, అవసరమైనపుడు రాజ్యాంగాల్లోనూ తన వ్యక్తిత్వాన్ని ప్రదర్శించాలి. అప్పుడే అతడు కృతార్థుడవుతాడు. అతనికవిత సార్థకమౌతుంది.

వెనుకటి కవు లందరూ ప్రభువులకు దాసానుదాసులై వారినే స్తుతిస్తూ, వారికోసమే కావ్యాలు రచిస్తూ ప్రజలకు చాలా దూరమైపోయారని ఇప్పటి కవుల్లో కొందరి భావన. ఇలా చెపుతూ వీరు తమ గదుల్లో కూర్చుని, సుఖంగా కాలం గడుపుతూ జన సామాన్యపు అత్యంత దయనీయావస్థను, సంఘ విద్రోహుల చర్యను, అస్తవ్యస్తమైన రాజకీయ వ్యవస్థలను వెల్లడిస్తూ, కవితలు వ్రాస్తూ జనంపై పారవేస్తూ ఉంటారు. వెనుకటి కవుల్లో రాజ్యాలు నిలిపినవారూ, రణరంగాలలో ప్రభువులకు వాదోడుగానే కాకుండా చేదోడుగా కూడా ఉండినవారు లేకపోలేదని చరిత్రల పుటలు తిరగవేస్తే తెలుస్తుంది.

శ్రీ దాశరథి కలంవాది మాత్రమే కాదు. కార్యవాదీ, ఖడ్గవాదిన్నీ. హైదరాబాదు విమోచనోద్యమంలో రాజకీయ వేత్తలతో చేతులు కలిపి, రజాకార్ల దురంతాలను ఎదుర్కొని అష్ట కష్టాలు పడి అనుభవం సంపాదించిన ఆదర్శకవి. అందువల్లనే ఆయనకవిత అందరికీ శిరోధార్య మయింది.

కవి క్రాంతదర్శి—అంటే ఇంద్రియాలకు అతీతములైన విషయాలనుకూడా చూడగలవాడు. శ్రీ దాశరథిపట్ల ఇది అన్వర్థమయి ఉంది. ఈ 'ఆలోచనాలోచనాలు' కూడా దీనికి అనుకూలమైన రచనే. చర్మ చక్షుస్సులు రెండే. అవి బాహ్య వస్తువులను కొన్నిటిని మాత్రమే—కనుచూపుదూరాన పురోభాగంలో ఉన్నవాటినే చూడగలవు. అంతర దృష్టికి లోచనాలు అనేకాలు. ఆ అంబకాలు లంబకాల వలెనే ప్రతిదానిలోనూ గాఢంగా చొచ్చి పరిశీలించి, వాటి అంతరాన్ని కనుగొంటాయి. అని పార్శ్వభాగాలలోనూ, పశ్చాద్భాగంలోనూ, క్రింది మీదులా అంతం లేని ప్రాంతంలో ప్రవేశించగలవు. అలా ప్రవేశించి, అవి కనుగొన్న విషయాలను నలభై ఎనిమిదింటిని సామాన్య పాఠకుడు చర్మచక్షుస్సులతో సులభంగా చూడడానికి, ఎవరయినా చదివితే శ్రోత్రేంద్రియంద్వారా వినడానికి అనుకూలంగా ఉండేటట్లు అందిస్తున్నవి.

పదగాంభీర్యమే కాని భావ గాంభీర్యం లేని కవితలూ, భావం వ్యక్తమయినా భాష పేలవంగా ఉన్న రచనలూ ఇప్పుడు అసంఖ్యాకంగా వస్తున్నవి. ఈ రచన వాటి వరుసకు చెందదు. భావం, రచన సరిసమానంగా కానవస్తున్నవి.

'వీరంగం వేస్తుంటే రాదు విప్లవం
తారంగం పాడుతుంటె రాదు సమరసం
అందుకోసమే నేనంటాను
ఏ లేహ్యం తిన్నాగాని రాదు యౌవనం.

రక్తం నదులై పారకపోతే
రాదా రెవల్యూషన్ ?
బుర్రలు బుర్రలు పగులక సమస్యలకు
లేదా సొల్యూషన్ ?
హింసా, యుద్ధం ఔట్‌డేటెడ్
అని నే నంటాను—
శాంతి ఒక్కటే మానవజాతికి
సరియగు సాల్వేషన్'' (పుట. 80)

అనే కవివాక్కు ఋషివాక్కని అనుకోవాలి.

— బులుసు వేంకటరమణయ్య

## శాంతి తీరాలకు

రచయిత : శ్రీ అంబటిపూడి వెంకటరత్నం, ఎం. ఏ. డెమ్మీసైజు 131 పుటలు. వెల : ఆరురూపాయలు. సాహితీమేఖల ప్రచురణ. ప్రతులకు – శ్రీ ఎ. వి. సుబ్రహ్మణ్యశాస్త్రి, 6-1-99 G. రామగిరి-నల్గొండ.

కడచిన ఉగాదినాటి ప్రపంచ తెలుగు మహాసభలను పురస్కరించుకొని ఉత్సాహపూరితులైన సాహితీవేత్తలు కొన్ని గ్రంథాలను వెలయించారు. వాటిలో ఈ గ్రంథం ఒకటి. రచయిత శ్రీ వెంకటరత్నంగారు సంస్కృతాంధ్రాంగ్లాది భాషల్లో నిష్ణాతులు భాషాత్రయంలోను గ్రంథాలు రచించిన సాహితీసమర్థులు. ప్రాచీనసాహిత్యాన్ని అవలోడన చేసి, గద్య, పద్య, దృశ్యకావ్యాలు రచించారు. నవ్యసాహితీ పద్ధతులపైని కూడా ఎక్కువ ఆదరం ఉండడంవల్ల ఆ సంప్రదాయాన్ననుసరించి కొన్ని – కవితలను ప్రకటించారు. ఈ 'శాంతితీరాలకు' నవ్యపద్ధతికి చెందిన రచన.

ఇది గద్యకవితా ఖండికల సంపుటి. అష్టోత్తరశత సంఖ్యలో ఉన్న ఈ కవితాపుష్పాలతో ఆంధ్రభారతి అపూర్వంగా అర్చించబడినది. దీనిని ప్రకటించిన 'సాహితీమేఖల' వ్యవస్థాపకులు ధవళా–శ్రీనివాసరావుగారు తమ 'ఒక మాట'లో "మానవుడు వేదన పొందిన తీరు, ఆ వేదనను అతిక్రమించి అత డందుకొనవలసిన గమ్యమును చేరుటలోని గతులు, అనంతవిధముల అభివర్ణింపబడినవి" అని రచయిత ఉద్దేశ్యాన్ని తొలుతనే తెలియజేసి, పాఠకులకు సౌలభ్యాన్ని కలిగించారు. ఈ కవితలను చదివినవారికి ఆయన చెప్పిన విషయాలు యథార్థాలని తెలియగలదు.

పద్యాన్ని వ్రాసి రసికులను ఆకట్టుకోవచ్చు. కొన్ని మినహాయింపుల రక్షణలో కవిత సాగవచ్చు. గద్యం అలాటిది కాదు. అందువల్లనే 'గద్యం కవీనాం నికషం వదంతి' అనే సూక్తి ఏర్పడినది. గద్యం వ్రాసి మెప్పించగలవాడే కవి. అట్టి పరీక్షకు గురియైనయీ రచన కృతార్థమయినదనే చెప్పవలసి ఉంది. కవిత్వం వ్యావహారిక భాషలో సాగడం దీనికి అనుకూల మయింది.

విస్మృతిపథంలో పడిన పరమసత్యాలను చూపుటలో ఇది ఆదర్శప్రాయమైనదనీ, ఎన్నో సమస్యలను విశ్లేషించి, సారభూతములైన సమాధానాలను చూపిన వ్యంగ్యరచన అనీ, సహృదయులు దీనిలోని అంతర్యాన్ని గ్రహించి కర్తవ్యాన్ని గుర్తించగలరనీ తప్పక చెప్పవచ్చును.

"ఎడారిలో ఒక వాక్కు ఇట్లా నినదించింది-
'ఓ మనస్సా! దుఃఖకథా సరస్వతి
వి న్ను దేశపరచకుందుగాక!
ఓ ఆత్మా! సహన మనే స్తంభానికి
చుట్టిన ఆశ లనే తెరచాప విప్పు.

స్వయంప్రకాశమైన శాంతి అనే ఓడరేవుకు
నిన్ను మహాసముద్రంలోనుండి
మెల్లగా చేర్చడానికి
మందమారుతాలను వదిలిపెట్టుమని
దిగ్దేవతలను ప్రార్థించు" [పుట 44]

ఇందులోని భావగాంభీర్యం, చమత్కృతిజనకాలైన రూపకాలు కవి ఉన్నతాదర్శాన్ని వ్యక్తపరుస్తున్నవి. కవితలన్నీ ఇట్టిరీతినే కొనసాగాయి.

ఆనందాచార్యుల 'శక్రశాఖ' ఆలంబనంగా ఈ రచన వెలువడ్డట్టు రచయిత తెలుపుతున్నారు. ఇది సహృదయులైన ఆంధ్రుల హృదయాలలో ఆనందాన్ని నింపగలదని ఆశిస్తున్నా.

— శ్రీ అంగీరస

## రాజతరంగిణి

[సంస్కృత మూలము: కల్హణ మహాకవి. ఆంధ్రానువాదము: శ్రీ స్వయంపాకుల వేంకట రమణశర్మ. రాయల్‌సైజు పుటలు 440. మూల్యము : ముప్పది రూపాయలు. ప్రతులకు : రచయిత శ్రీ లలితా మెకానికల్ ఇన్‌స్టిట్యూట్, బాలాజీనగర్, నెల్లూరు—2.

---

కాశ్మీరమువాడై న కల్హణుడు తన కాలమువరకు తన మాతృభూమిని పరిపాలించి పోయిన రాజ వంశముల యొక్కయు రాజుల యొక్కయు జీవిత విశేషములను చారిత్రక సత్యముల నతిక్రమించకుండ కావ్య రచనా శిల్పమునకు లోపము లేకుండ సంస్కృత భాషయందు రచించెను. ఇంతగా చారిత్రక ప్రాముఖ్యమును సంతరించుకొన్న కావ్యరచనా విశేషము మరొకటి మన భారతీయ భాషా వాఙ్మయములయందు లేదు. ఆయా రాజుల స్వరూప స్వభావములను చిత్రించుటలో కల్హణ మహాకవిరాజుకు రాజుకును వైలక్షణ్యమును సంపాదించిన వైన మాయనప్రజ్ఞావిశేషమునకు నికషముగా నున్నది. కాశ్మీరమును పాలించిన మహారాజులలో మహావిద్వాంసులును కవులును౹ కవిపండితులను పోషించినవారున్నారు. మహావీరులును విజయులును అయి సామ్రాజ్య విస్తరణమునకు కృషిచేసినవారున్నారు. శత్రువుల దురాక్రమణములను ఎదుర్కొని త్రిప్పికొట్టగలిగినవారున్నారు. ప్రజారంజన కార్యక్రమముల నమలుచేసిన ధర్మబుద్ధితప్పనివారున్నారు. ఈ యందరలోను మానవ స్వభావ లక్షణము లయిన రాగద్వేషములు, ఈర్ష్యాసూయలు, కామక్రోధములు,సుఖ దుఃఖములు—ఈ మొదలుగాగల ద్వంద్వము లన్నియును అవి యెట్లున్నవో అట్లు ప్రదర్శించుటలో కల్హణ మహాకవి అటుఇటు వ్రాలక తాను తటస్థుడుగా నుండుట ప్రశంసనీయ మైన విషయముగా నున్నది. యథా రాజా తథా ప్రజాః అన్నది నిజమగుచో కాశ్మీరమును పాలించిన ఈ రాజుల చరిత్రమును బట్టి ఆయా కాలములయందు ఆయా రాజులచేత వరిపాలింపబడిన ప్రజల చరిత్రముకూడ అట్లే యున్న దనుకొనవలయును. ఆ విధముగా కల్హణమహాకవి కాశ్మీరవాసులయొక్క కొన్ని వందల సంవత్సరముల చరిత్రను పరమాహ్లాదకరముగా రచించెను. కల్హణుడు పన్నెండవశతాబ్దమునందున్నవాడు. రాజ తరంగిణి మె ము ఎనిమిది తరంగములు. తొంబదిమంది రాజుల కథలు. కల్హ చంపూ పద్ధతిలోనే ఈ గ్రంథమును రచించెను. ఇది ఇంతకు ... మొకసారి పోలవరము జమీందారుగారిచేత వచనమున తెనుగున కనువదింపబడినదని చెప్పుటచేత వినుటయేగాని చూచినదిలేదు. ఇప్పుడీ అనువాదము చేసిన శ్రీ స్వయంపాకుల వేంకటరమణశర్మగారు పద్యములను రెండింటిని జోడు గుర్రములవలె ,నడిపింపగలవా...టచేత ఇదియు చంపూకావ్య పద్ధతిలో చేయబడినది. మరియు శ్రీ శర్మగారు కల్హణ మహాకవి కవితా విశేషములను, మరియు కొన్ని చారిత్రకాంశములను వివరించుచు విపులమైన ఉపోద్ఘాతమునుకూడ సమకూర్చిరి. దీనికి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారి ఉపోద్ఘాతముకూడ ఆంగ్లమునందుండి అందముగా నున్నది.

ఈ రాజతరంగిణిమీద ఆధారపడి భారతీయ భాషా వాఙ్మములయం దెందరో కావ్యములను నవలలను వెలయించినారు. తెలుగులో వచ్చిన శ్రీ విశ్వనాథవారి నవలలు మిహిరకులుడు-యశోవతి—భ్రమరవాసిని మొదలయిన నవలలట్టివే. ఈ రాజ తరంగిణి కథా చమత్కారముకలిగి, వర్ణనా నైపుణ్యముతో, విజ్ఞానాత్మకముగా అపూర్వ రామణీయకమును పుణికి పుచ్చుకొన్నది. ఇంత ఉదాత్తమైన ...తిని తెనుగున కనువదించి తెనుగుప్రజలకు అందించిన శ్రీ వేంకట... శర్మగారు అభినందనీయులు. అనువాదము సరళసుందరముగా ను...

— శ్రీ క్షేమేం...

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna, Vijayawada. Phones : 75667 & 75226.


AMRUTANJAN
Pain Balm
SALOFEN
AMRUTANJAN INHALER
AMRUTANJAN
LTD.
Gripe Mixture
Anoleum

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA104M129 |
| పుస్తకం పేరు | భారతి |
| తారీఖు | 07 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | e[ ,BC]. |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | akshaya |
| పేజీలు విడదీసినది | navya |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |